ముల్లోకాలకు సంతోషాన్ని కలిగించాలి. సజ్జనుల సద్గుణాలను పరమాణువంత పరిమాణంలో ఉన్నాసరే పర్వతమంతచేసి పొగడాలి. ఇతరులను సంతోషపెట్టుట ద్వారా తాము సంతోషించాలి. ఇట్లు చేసిన యెడల జీవితం ఆనందమయమై, కీర్తివంతమై వెలుగొందునని భర్తృహరి పరోపకార పద్ధతిని చెప్పి, ఆపై ధైర్య పద్ధతిని ప్రారంభిస్తున్నాడు.

## ధైర్య పద్ధతి

మంచి పనులకు ఆటంకాలు ఎక్కువ. మంచిగా జీవించాలనుకొనే వారికి పరీక్షలెక్కువ. ధైర్యంగా ఉండాలి. స్థిరంగా ఉండాలి. లక్ష్యాన్ని అందుకోవాలి. అమృతం కోసం దేవతలు పాలసముద్రాన్ని చిలికారు. అందులో నుండి మొదట కాలకూటమనే భయంకరమైన విషం పుట్టింది. దేవతలు దానికి భయపడలేదు. తర్వాత కల్పవృక్షం, కామధేనువు, అనేక రత్నాలు పుట్టాయి. వాటితో తృప్తిపడి సముద్ర మథనం చాలించలేదు. అమృతం లభించేవరకు చిలకడం ఆపలేదు. ధీరులు తాము కోరుకొన్నది లభించేవరకు ప్రయత్నాన్ని ఆపరు.

మనుషులు మూడు రకాలు. ఏదైనా పని ప్రారంభిస్తే ఆటంకాలుంటాయి. శ్రమ ఉంటుంది. దానికి భయపడి అసలు పనే ప్రారంభించరు. వీరు అధములు. మరికొందరు పనిని ప్రారంభిస్తారు. ఏదో ఒక ఆటంకం ఎదురౌతుంది. ఆ ఆటంకాన్ని తొలగించుకోరు, ఏకంగా పనినే వదిలేస్తారు. వీరు మధ్యములు. ఇంకొందరు పనిని మొదలుపెడతారు. ఆటంకాలు వస్తాయి. అధిగమిస్తారు. శ్రమ కలుగుతుంది ఓర్చుకొంటారు. ప్రతి ఆటంకం తర్వాత వారి ధైర్యం పెరుగుతుంది, ఉత్సాహం రెట్టింపవుతుంది. వీరు ధీరులు, వీరే ఉత్తములు, వీరే కీర్తికి అర్హులు.

ఏదైనా ఒక పనిని చేపట్టి పూర్తిచేసే క్రమంలో ధీరులు అనేక కష్ట సుఖాలను ఎదుర్కొంటారు. ఒకచోట నేలమీద పడుకొంటారు. అవకాశం ఉంటే పూల పాన్పుపైన పడుకొంటారు. ఒకచోట మంచి కూరలతో కూడిన వరి అన్నాన్ని భుజిస్తారు. మరొకప్పుడు పస్తులుంటారు. ఒక్కో పర్యాయం బొంత ధరిస్తారు. ఒక్కోసారి దివ్యాంబరాలు ధరిస్తారు. అన్ని సందర్భాల్లోను కార్యసాధకులు నిశ్చలంగా ఉంటారు. కష్టసుఖాలను గణించరు.

నీతివేత్తలైన నిపుణులు నిందించినా, మెచ్చినా, సంపదలు సమకూరినా, చేజారినా, తక్షణ మరణం ప్రాప్తించినా, దీర్ఘాయువు గల్గి, కల్పాంతం నందు మృతి బొందినా ధీరులైన వారు న్యాయమార్గంనుండి చలించరు. తాము న్యాయమని భావించి ప్రారంభించిన పనుల వలన కలిగే ఫలితాలతో నిమిత్తం లేకుండా ధీరులు కొనసాగిస్తూ ఉంటారు.

యువతుల ఓరగంటి చూపులు పదునైన బాణాలు. అవి తగిలినా చలించని మనస్సు ఉండాలి. కోపాగ్నికి దహింపబడని వాడుగా ఉండాలి. ఆశాపాశములకు బద్ధుడు గాని వాడుగా ఉండాలి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను ఇంద్రియ విషయాలకు ఆకర్షితుడు కానివాడుగా ఉండాలి. అటువంటి వాడు ఈలోకాలను జయించగలిగిన ధైర్యవంతుడు. అనగా ధీరత్వం అనేది ఇంద్రియ నిగ్రహం వలన అలవడుతుందని అర్థం.

ధైర్యవంతునికి కూడా విధివశాత్తు అపజయాలు కలుగుతాయి. కాని, అతడు అధైర్యపడడు. నిబ్బరాన్ని కోల్పోడు. అతడు అగ్నిశిఖ వంటివాడు. అగ్నిశిఖను తలక్రిందులు చేసినా మంటపైకే ఉంటుంది. ఇదే ధైర్యవంతుని లక్షణం.

ఎన్నికష్టాలు వచ్చినా శీలాన్ని విడువరాదు. దానికంటే కొండ శిఖరం మీద నుండి బండరాతిపైకి దూకుటో, పామునోట్లో చేయిపెట్టుటో నిప్పులో పడుటో మంచిది.

సత్య పునీతమైన శీలం కలవానికి నిప్పు నీరవుతుంది. మహాసముద్రం పిల్లకాలువ అవుతుంది. మేరుపర్వతం గులకరాయి అవుతుంది. సింహం, జింకవు తుంది. సర్పం పూలదండవుతుంది. విషం అమృతమవుతుంది. శీలం వల్ల లోకమంతా వశమౌతుంది.

చెట్టును నరికితే తిరిగి చిగుర్లు పుడతాయి. కృష్ణపక్షంలో క్షీణించిన చంద్రుడు శుక్లపక్షంలో వృద్ధి చెందుతాడు. ఇది బాగా తెలిసిన ధీరులు హానివృద్ధులకు చింతించరు.

ఐశ్వర్యానికి ఆభరణం సుజనత్వం. పరాక్రమానికి అలంకారం సంయమనంతో కూడిన మాటలు. విద్యకు భూషణం వినయం. ధనమునకు పాత్రత ఎరిగిన

దానం, తపస్సుకు కోపంలేకుండా ఉండటం, శక్తికి ఓర్పు, ధర్మానికి గర్వం లేకుండా ఉండటం అలంకారాలు. అన్నిగుణాలకు శీలమే ఆభరణం అని ధైర్యపద్ధతిని ముగించిన భర్తృహరి దైవపద్ధతి ప్రారంభిస్తున్నారు.

## దైవ పద్ధతి

ప్రతిమానవుడు ఆనందంగా జీవించాలని కోరుకుంటాడు. అలా బ్రతకడానికి అనేకమైన పనులు చేస్తుంటాడు. మరికొన్ని చేయాలనుకొంటాడు. ఎంతో ప్రయత్నం చేస్తాడు. ఒక్కొక్క పర్యాయం సంకల్పం ఫలిస్తుంది. మరొక్కపర్యాయం విఫలమౌతుంది. సఫలమైతే ఆ ఫలితానికి కర్త తానే అనుకొంటాడు. విఫలమైతే కంటికి కనిపించని అదృష్టాన్ని నిందిస్తాడు. దైవమే కారణమంటాడు. అందుకోసం అనేకమైన సంఘటనలు ఉదాహరణగా చూపిస్తాడు.

నిరాశనుండి బయటపడడానికి అదృష్టం ఉపయోగపడితే సంతోషం. కృషిని విస్మరించి, నిష్క్రియాపరుడుగా, సోమరిపోతుగా తయారు కావడానికి అదృష్టం దోహదం చేయకూడదు. చాలా సందర్భాలలో మనిషి ప్రయత్నం కంటే అదృష్ట రూపమైన దైవం బలంగా కనిపిస్తుంది.

ఇంద్రునికి గురువు బృహస్పతి. అత్యంత కఠినమైన వజ్రం ఆయుధం. దేవతలే సైన్యం. స్వర్గమే దుర్గము. ఐరావతం వాహనం. విష్ణుమూర్తి సహాయకుడు. ఇంత సామర్థ్యము, సామగ్రి కలిగిన ఇంద్రుడు యుద్ధంలో రాక్షసుల చేతిలో పరాజయాన్ని పొందాడు. ఇంద్రుని పౌరుషం ఏమైనట్లు? జయాపజయాలకు దైవబలమే ప్రధానమైనది.

ఒక ఎలుక ఆకలితో బాధపడుచుండెను. ఆహారమునకై రాత్రిపూట వెదుకుచూ ఉండెను. దానికి ఒక బుట్ట కన్పించెను. ఆ బుట్టలో తన ఆకలిని తీర్చే పదార్థ మేదైనా ఉంటుందని ఊహించెను. సత్తువనంతా పండ్లలోనికి తెచ్చుకొని, ఆ బుట్టకు రంధ్రం చేసెను. లోనికి వెళ్ళెను. బుట్టలో ఒక పాము ఉన్నది. అదికూడా ఆకలితో, ఆహారం కొరకు ఎంతో ప్రయత్నించింది. తిండి దొరకలేదు. నిస్సత్తువ ఆవహించింది. ఇంద్రియాలు పట్టు తప్పిపోయాయి. ఇక చేసేది లేక చుట్ట చుట్టుకొని బుట్టలో పడుకొని ఉండెను. ఎలుక లోనికి రాగానే దానిని తృప్తిగా మ్రింగెను. ఆకలిని తీర్చుకొనెను. ఎలుక చేసిన రంధ్రం గుండా బయటకు వెళ్ళి

పోయెను. కావున మానవుని సుఖదుఃఖాలకు దైవమే కారణం. ఆరాటపడిన ప్రయోజనం ఉండదు. ప్రశాంతంగా ఉండాలి. సానుకూల దృక్పథంతో నడుచు కోవాలి.

వృద్ధిక్షయాలు వస్తూ ఉంటాయి. పోతూ ఉంటాయి. సజ్జనుడు కూడా హీనస్థితిని పొందుతాడు. క్రిందపడిన బంతి అంతే వేగంతో పైకి లేచినట్లు సజ్జనుడు మరళా ఉన్నతస్థితిని పొందుతాడు. దుర్జనుడు మట్టిముద్దవంటివాడు. విపరీతమైన సోమరితనం, భయం – కారణంచేత హీనస్థితిని పొందితే అలాగే ఉండిపోతాడు. కనీసం ఆస్థితిని అధిగమించడానికి ప్రయత్నం కూడా చేయడు.

ఒక బట్టతలవాడుండెను. ఒక మధ్యాహ్నవేళ సూర్యుని వేడిమికి అతని తల మాడుచుండెను. ఆ మంటకు తాళలేక అతడు ఒక తాటిచెట్టు నీడకు వెళ్ళెను. అప్పుడు ఒక పెద్ద తాటిపండు అతని తలపై పడెను. అతని తల పగిలెను. దైవబలము లేనివాని పరిస్థితి ఈవిధంగా ఉంటుంది. అతడు ఎక్కడికి వెళ్ళితే ఆపదలు అక్కడికే, వానివెంటే వెళ్ళుతాయి.

విధి బలీయమైనది కాకపోతే ఏనుగుల వంటి బలమైన జంతువులు, పాముల వంటి క్రూరజంతువులు, హాయిగా ఎగిరిపోగల పక్షులు ఎందుకు బంధింప బడతాయి? సూర్యచంద్రులు రాహువు చేత పీడింపబడటం, బుద్ధిమంతులు దరిద్రులుగా ఉండటం, నైతిక విలువలు లేని వారు ఐశ్వర్యవంతులుగా ఉండటం దేన్ని తెలియజేస్తాయి? విధి బలీయమనే కదా!

దైవం ఒకణ్ణి సృష్టిస్తాడు. ఆ ఒక్కడు సకల సద్గుణ సంపన్నుడై ఉండును. భూమండలమునకు అలంకార ప్రాయుడైన పురుషశ్రేష్ఠుడుగా ఉండును. పుట్టిన అనతికాలములోనే మృత్యువాత పడును. దైవము చేష్టలు ఇట్లుండును. విచారించి చూచిన దైవం తెలివి తక్కువ వాడుగా కన్పించును. కాని, దైవప్రణాళిక బలీయ మైనది. దానికి మనిషి రాగద్వేషాలతో సంబంధం లేదు. ఎంతటి వారలైన దైవప్రణాళికకు కట్టుబడాల్సిందే.

చంద్రుడు అమృత నిధి. ఓషధులకు రాజు. శతభిష నక్షత్రం ఇతనిని వెంబడించుచును. భిషక్ అనగా వైద్యుడు. అంటే వందమంది వైద్యులు చంద్రుని అనుసరిస్తారు. సకలలోక శంకరుడైన శంకరుని తలకు చంద్రుడు భూషణం.

అయినా సరే అతనిని క్షయరోగం వదలదు. కృష్ణపక్షంలో రోజురోజుకు క్షీణిస్తాడు కదా! విధి నిర్ణయం దాటడం ఎవరికి సాధ్యమౌతుంది?

దైవం కుమ్మరి వంటివాడు. మనిషి మనస్సును మట్టిముద్దగా చేస్తాడు. ఆపదలనే కర్రలతో పదే పదే బాదుతాడు. ఆపై దిగులు అనే చక్రంపై మనస్సు అనే మట్టిని వేసి తిప్పుతాడు. ఆ మట్టికిగాని, దానిని చూసేవారికి గాని అతను ఏపాత్ర చేస్తాడో తెలియదు. ఏ ఫలితం మానవునికి లభిస్తుందో తెలియదు. కుమ్మరి మాత్రం తెలిసే చేస్తాడు. సామాన్యులు ధైర్యాన్ని కోల్పోతారు. దైవలీలకు లొంగిపోతారు. క్రుంగిపోతారు. డీలాపడి ఆత్మహత్యలకు కూడా పూనుతారు. మహాత్ములు ధైర్యంగా ఉంటారు.

మహాత్ములకు కూడా ఆపదలు వస్తాయి. వారు ధైర్యాన్ని కోల్పోరు. సప్త సముద్రాలు కాని, కులపర్వతాలు కాని వాటి హద్దులను మీరవు. కల్పాంతంలోనూ క్రుంగిపోవు. సముద్రం వంటి గాంభీర్యం, పర్వతం వంటి స్థైర్యం కలిగిన మహాత్ములు దైవవశాత్తు సంభవించే కష్టాలను సైతం స్థిరంగా ఎదుర్కొంటారు.

ఆకాశమంతా మబ్బులు క్రమ్ముకొని ఉంటాయి. ప్రతిదినం వర్షిస్తూ ఉంటాయి. వర్షం కోసం ఎదురుచూసే చాతకపక్షి నోట్లో రెండో మూడో వర్షపు బొట్లు పడతాయి. ఎవనికి ఏది దక్కాలని దైవం నిర్ణయిస్తాడో అదివానికి దక్కుతుంది. దానికి పెద్దలను ఆశ్రయించాల్సిన పనిలేదు. ఎంత ఆరాటపడినా చిల్లి గవ్వకూడా దైవనిర్ణయం లేకుండా ప్రాప్తించదు. అందుకే ప్రాప్తించని దానికోసం దిగులు పడకూడదు. లభించిన దానితో తృప్తిపడాలి. దొరకడానికి దొరకక పోవడానికి దైవమే కారణమని వివరించిన భర్తృహరి కర్మపద్ధతిని ప్రారంభిస్తున్నాడు.

## కర్మ పద్ధతి

ఇంద్రాది దేవతలకు నమస్కారం. వారు దైవమునకు లోబడి ఉందురు. కావున దైవమునకు నమస్కారం. దైవం కర్మననుసరించి ఫలితము నిచ్చును. కర్మ అనగా పని. పనిని అనుసరించియే ఫలితముండును. ఇంక దైవమెందుకు? దేవతలెందుకు? దైవం దుష్కర్మ చేసిన వానికి సత్ఫలము నీయదు. సత్కర్మ చేసిన వాడికి చెడుఫలితాన్ని ఇవ్వదు. కర్మ వ్యక్తిగతం. ఫలం కర్మగతం. దైవం కూడా కర్మను అధిగమించలేదు. కావున కర్మకు నమస్కారం.

ఈ బ్రహ్మాండ భాండంలో బ్రహ్మను బొమ్మలచేసే కుమ్మరిని చేసింది కర్మయే. దశావతారాలనే సంకటమయమైన అరణ్యంలోనికి విష్ణువును పడద్రోసింది కర్మయే. కపాలాన్ని చేతబట్టుకొని భిక్షాటన చేయునట్లు శివుని శాసించినది కర్మయే. సూర్యున్ని అనునిత్యం ఆకాశంలో త్రిప్పేది కర్మయే, ఆకర్మకు నమస్కారం.

శ్రేష్ఠమైన సత్కర్మ దుష్టులను శిష్టులుగా మారుస్తుంది. మూర్ఖులను పండితులను చేస్తుంది. శత్రువులను మిత్రులుగా, పరోక్షాన్ని ప్రత్యక్షంగా, విషాన్ని అమృతంగా చేస్తుంది. అందువల్ల సత్కర్మనే ఆచరించాలి. ఏవో గుర్తింపుల కోసం ప్రాకులాడుతూ, చేయాల్సిన పనిని (విహిత కర్మ) వదలి పెట్టకూడదు.

పూర్వజన్మలో ఆచరించిన పుణ్యకర్మకు ఫలితంగా ఈజన్మలో మంచి భవనం, సౌందర్యవంతులైన యువతులు, శత్రువుల బెడదలేని రాజ్యం మొదలైనవన్నీ కలుగుతాయి. ఆకర్మఫలం అనుభవించగానే ఆమేడలు, విలాసాలు అన్నీ రతిక్రీడలో తెగిన ముత్యాల హారంలోని ముత్యాలు చెల్లా చెదురైనట్లు క్షణాల్లో మాయమౌతాయి. అందువల్ల సత్కర్మలను నిరంతరాయంగా ఆచరిస్తూనే ఉండాలి.

ఏదైనా ఒక పనిని చేయాలనుకొన్నప్పుడు దానిని గూర్చి బాగా ఆలోచించాలి. కష్టనష్టాలను బేరీజువేసుకోవాలి. తొందరపడి ఏపనీ చేయకూడదు. తొందరపడి చేసిన పనుల చెడు ఫలితాలు జీవితాంతం వెంటాడుతూ ఉంటాయి. ముల్లు వలే హృదయాన్ని తాకుతూ ఉంటాయి. మనస్సును దహిస్తూ ఉంటాయి. కాబట్టి బాగా ఆలోచించాలి. మంచి ఫలితాలనిచ్చే పనిని ఎన్నుకొని ఆచరించాలి. ఇది పండితునికీ, పామరునికి కూడా వర్తిస్తుంది. ఈ విషయంలో పండితుడు మరింత జాగ్రత్తగా ఉండాలి.

భారతదేశం కర్మభూమి. ఇక్కడ జన్మించిన వారు తపస్సు చేయాలి. చేయని వాడు భాగ్యహీనుడు. వైడూర్య మణులతో తయారుచేసిన పాత్రలో, చందనపు కొయ్యలను మండించి, తెలకపిండిని వండటం ఎంత మూర్ఖత్వం? జిల్లేడు దూదిని పండించడానికి భూమిని బంగారు నాగలితో దున్నడం ఎంతటి మూర్ఖత్వం? ఆరికపైరు (ఒక తృణధాన్యం) కు కంచె వేయుటకు కర్పూరపు చెట్లను నరికే వానిది ఎంత మూర్ఖత్వం? భారతీయుడుగా పుట్టి సత్కర్మలను తపస్సుగా ఆచరించక పోవడం కూడా అంతే మూర్ఖత్వం.

మనిషియొక్క రూపంగాని, కులంగాని, శీలంగాని, విద్యగాని, సేవగాని ఫలితాన్ని ఇవ్వవు. పూర్వంచేసిన తపస్సు మూలంగా కలిగిన పుణ్యమే ఆయా ఋతువుల్లో ఫలించే చెట్లలా ఫలితాన్నిస్తాయి. అంటే రూపంవల్ల గాని, కులం వల్లగాని, శీలం వల్లగాని, విద్యవల్లగాని, సేవవల్లగాని ఫలితాన్ని పొందాలంటే పూర్వపుణ్యం ఉండితీరాలి. బల్బువల్ల వెలుతురు, ఫ్యానువల్ల గాలి మొదలగునవి విద్యుత్తు సరఫరా ఉన్నప్పుడే కలుగుతాయి. అంటే రూప కుల శీలాదులు కేవలం ఉపకరణాలు మాత్రమే వీటిని మాధ్యమంగా చేసుకొని కర్మకు ఫలితం అందుతుంది.

నీళ్ళలో మునిగినా, మేరు శిఖరం మీదికి వెళ్ళినా యుద్ధంలో శత్రువులను జయించినా, వర్తకం, వ్యవసాయం, ఉద్యోగం మొదలయిన విద్యలను, సమస్త కళలను అభ్యసించినా, మహాప్రయత్నంతో పక్షివలే విశాలమైన ఆకాశంలో సంచరించినా, పూర్వపుణ్యం వలన ఏది జరుగవలసి ఉందో అది తప్పక జరుగుతుంది. మానవుడు ఎంత ప్రయత్నించినా జరుగకూడనిది జరుగనే జరుగదు.

అరణ్యంలో ఉన్నా, యుద్ధంలో ఉన్నా, శత్రువుల మధ్యలో ఉన్నా, నీళ్ళలో, అగ్నిలో, సముద్రంలో, పర్వతశిఖరంపై ఎక్కడ ఉన్నా, నిద్రిస్తూ ఉన్నా, మేల్కొని ఉన్నా, మత్తులో ఉన్నా, అపాయస్థితిలో ఉన్నా మానవుని పురాకృత పుణ్యం వలన రక్షింపబడతాడు. పర్వతంవలే సమీపించిన కష్టం పుణ్యకర్మ మూలంగా దూది పిందెవలే ఎగిరిపోతుంది.

పూర్వం సత్కర్మచేసి, పుణ్యధనాన్ని కూడబెట్టుకొన్న వానికి భయంకరమైన అరణ్యం కూడా ముఖ్యపట్టణమౌతుంది. భూమండలమంతా రత్నాలతో, నిధులతో నిండి ఉంటుంది. సర్వజనుల ఆత్మీయులౌతారు. కావున ప్రతిమానవుడు సత్కర్మను తపస్సుగా ఆచరించి సత్ఫలితాలను పొందాలని చెప్పి భర్తృహరి కర్మపద్ధతిని ముగించాడు.

దీనితో నీతిశతకం ముగిసింది. తర్వాత శృంగార శతకం ప్రారంభమౌతుంది.



# శృంగార శతకం

## స్త్రీ ప్రశంస

ఓం మన్మథాయనమః

ప్రకృతిలోని జీవులు ఆడ, మగ అని రెండు రకాలు. అవి రెండూ శారీరకంగా కలిసినపుడు కొత్తజీవి పుడుతుంది. దీన్ని సృష్టి అంటాం. అలా పుట్టిన జీవులు మరళా కొత్త జీవుల్ని పుట్టించాలంటే అవి పెద్దవికావాలి, అందుకు పోషణ జరగాలి. జీవ పరిణామంలో పుట్టిన జీవులు పెద్దవికావడం, ముసలివైపోవడం తరువాత చనిపోవడం జరుగుతుంది.

ఈ మొత్తం ప్రక్రియలో జీవులు పుట్టడానికి కారణమైన శక్తిని 'బ్రహ్మ' అంటాం. అతని భార్య సరస్వతి. ఆమెను అతడు ముఖంలో ఉంచుకుని కాపురం చేస్తుంటాడు. పోషణకు కారణమైన శక్తిని 'విష్ణువు' అంటాం. ఆయన భార్య లక్ష్మి, ఆమెను విష్ణువు ఎదపై ధరించి ఉంటాడు. లయమై పోవడానికి అనగా మరణించడానికి కావలసిన శక్తిని 'శివుడు' అంటాం. శివుని భార్య పార్వతి. పార్వతిని శివుడు తన సగం శరీరంగా మార్చుకుని ఉంటాడు. అంటే సృష్టిస్థితి లయాలకు కర్తలైన బ్రహ్మ, విష్ణు, శివులు వారి వారి భార్యలను నిరంతరం విడువకుండా కాపురం చేస్తున్నారు.

శృంగారానికి మూలపురుషులైన బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులను ఆ లేడికన్నుల వంటి కన్నులు కలిగిన సరస్వతి లక్ష్మి పార్వతుల ఇండ్లలో దాసులుగా చేసిన మొనగాడు మన్మథుడు. ఈ మన్మథుడు అనేక చిత్ర విచిత్రాలు చేయగల వాడు, అతను చేసే పనులు మాటలతో చెప్పనలవి కాదు. అతను మకరధ్వజంతో వెలుగొందుతుంటాడు. అతను లేకపోతే శృంగారమే లేదు. సృష్టి అసల్లేదు. అందుకే శృంగార శతకాన్ని ప్రారంభిస్తూ మొదటి శ్లోకంలో భర్తృహరి మన్మథునికి నమస్కారం చేశాడు.

శృంగార రసానికి ఆలంబన స్త్రీ, సృష్టికి స్త్రీ ఆలంబన. స్త్రీలేకుండా సృష్టి జరుగదు. అందుకే భర్తృహరి తరువాత పందొమ్మిది శ్లోకాలలో శృంగారంలో స్త్రీపాత్రను ప్రశంసిస్తున్నాడు.

యవ్వన వయస్సులో ఉన్న స్త్రీలు, పురుషులను ఆకర్షిస్తారు. కొందరు చిరు నవ్వుతో, కొందరు హావభావాలతో, కొందరు సిగ్గుతో, కొందరు తమకున్న భయంతో, కొందరు ఓరగంటి చూపులతో, అలుకతో, సొగసుతో ఇలా అనేక చేష్టలతో మగవారిని ఆకర్షించి సంసారబంధంలో కట్టిపడేస్తారు.

బాల్యం పోయి యవ్వనం వస్తున్న స్త్రీని ముగ్ధ అంటారు. వీరిలో భావం, లీల అనే శృంగార చేష్టలు ఉంటాయి. భావం అంటే యవ్వనం వస్తున్న తొలినాళ్లలో కలిగే కామపు ఆలోచనలు, లీల అంటే సిగ్గు, భయం, బెదురు చూపులు మొదలగు హావభావాలు, ఇవన్నీ పురుషుణ్ణి ఆకర్షిస్తాయి. ఇవి పురుషుణ్ణి ఆకర్షిస్తాయనే విషయం ముగ్ధలైన కన్యలకు తెలియకపోవచ్చు.

సంపూర్ణయవ్వనం, కామం, సిగ్గు, భయం ఇవన్నీ సమపాళ్లలో కలిగిన స్త్రీని 'మధ్య' అంటారు. ఇటువంటి స్త్రీలకు కనుబొమలను నేర్పుగా వంచి, ఓరగంట చూడటం, అనురాగంతో కూడిన మాటలు మాట్లాడటం, సిగ్గుతో కూడిన చిరునవ్వు నవ్వడం, వయ్యారంగా, మెల్లమెల్లగా నడవడం ఇవన్నీ ఆభరణాలుగా ఉంటాయి. మగవారిని వశపరచుకోవడానికి ఈ ఆభరణాలన్నీ ఆయుధాలుగా ఉపయోగ పడతాయి.

సిగ్గు, భయం, లజ్జ మొదలగు గుణాలు కామం చేత అదిమిపెట్టబడిన స్త్రీని 'ప్రౌఢ' అంటారు. స్త్రీలలో ప్రధాన ఆకర్షణ కన్నులే. నల్లకలువలు దిక్కులంతా వెదచల్లినట్లు స్త్రీల కన్నులు నిగనిగలాడుతుంటాయి. కొందరి కళ్లు బొమముడితో ఆకర్షిస్తాయి. కొందరి చూపుల్లో కోరిక కనిపిస్తుంది. కొందరి చూపుల్లో ఆశ్చర్యం కనిపిస్తుంది. ఈ చూపులన్నీ మగవారి హృదయాన్ని ఛేదించే తూపులే. ఈ బాణాల దెబ్బతిన్న మగవారు స్త్రీకి దాసోऽహమంటారు.

అలంకారం కూడా మగవారిని ఆకర్షిస్తుంది. ఈ అలంకారం రెండు రకాలు, వాటిలో మొదటిది సహజం, అంటే పుట్టుకతో వచ్చే శరీరాకృతి, రంగు

మొదలగునవి. రెండవది ఆహార్యం అనగా బట్టలు, నగలు, లేపనాలు మొదలగు వాటి వల్ల వచ్చే అలంకారం. వీటిలో స్త్రీలకు సహజాలంకారమే ప్రధానమైనది.

చంద్రుని వంటి ఆహ్లాదకరమైన ముఖం, తామరపూరేకుల్ని గేలి చేయగలిగిన కన్నులు, బంగారంవలే నిగనిగలాడే శరీరపు రంగు, తుమ్మెదలగుంపును గెలువ గలిగిన కొప్పు, ఏనుగుల కుంభస్థలాలను మించిన ఎత్తైన గుండ్రని స్తనాలు. పెద్ద నితంబాలు యవ్వనవతులకు సహజమైన అలంకారాలు. వీటితోపాటు మృదువైన మాటలు కూడా ఆకర్షణీయమైన అలంకారములే. ఇలా చెప్పుకుంటూ పోతే యవ్వన వతి ముఖంలోని చిరునవ్వు, చంచలమైన చూపులు, సరసమైన మాటలు, ఒయ్యారమైన నడక మొదలైనవన్నీ అందమైనవే. ప్రత్యేకించి ముగ్ధ వయసులోనివారి లేడికన్నుల్లాంటి కన్నులు చాలా అందమైనవి.

మానవులు సహజంగా సుఖాన్ని ఇంద్రియాల ద్వారా పొందుతారు. ఇంద్రియాలు కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు అని రెండురకాలు. వీటిద్వారా పని చేయించుకొని సుఖాన్ని పొందుతుంది మనసు. జ్ఞానేంద్రియాలైన కన్నులు మంచి దృశ్యాన్ని చూడడం ద్వారా, ముక్కు సుగంధభరితమైన వాసనను పీల్చడం ద్వారా, చెవులు శ్రుతి సుభగమైన శబ్దాన్ని వినడం ద్వారా, నాలుక రుచికరమైన పదార్థాలను తినడం ద్వారా, చర్మం మృదువైన వాటిని స్పృశించడం ద్వారా మనిషికి ఆనందాన్ని కలుగజేస్తాయి.

రసికులైన పురుషులు చూడదగిన వాటిలో శ్రేష్ఠమైనది యవ్వనవతి ముద్దు ముఖమే. వాసన చూడదగిన వస్తువులలో శ్రేష్ఠమైనది పద్మినీజాతి స్త్రీల ముఖ పద్మాన్ని తాకి వచ్చే గాలి మాత్రమే. వినదగిన విషయాలలో శ్రేష్ఠమైనవి అందగత్తెల చిలుకపలుకులు మాత్రమే. రుచి చూడదగిన వాటిలో శ్రేష్ఠమైనది సుందరీమణి లేతదగు క్రింది పెదవిలో దాగిన అమృతం మాత్రమే. తాకదగిన వాటిలో శ్రేష్ఠమైనది పూదీగవలే మెత్తనైన తరుణీమణి శరీరం మాత్రమే. మనసులో నిరంతరం ఆలోచించ వలసిన విషయం పువ్వులవంటి శరీరం యొక్క యవ్వన విలాసాలు మాత్రమే. ఉత్తములగు రసికులు ఉత్తమ రూప లావణ్యాలు కలిగిన స్త్రీలతో సంభోగాన్ని కోరుకొనుట ద్వారా ఆనందాన్ని పొందుతారు.

పదారేండ్ల ప్రాయపు స్త్రీ 'బాల'. ఇరవైయేండ్ల స్త్రీ 'తరుణి'. ఇరవై నుండి యాభై ఐదేండ్ల వరకు 'ప్రౌఢ'. అటుపై 'వృద్ధ' స్త్రీలుగా పరిగణిస్తారు. హేమంత

ఋతువులో తరుణి సంభోగమునకు యోగ్యమైనది. వర్ష, వసంత ఋతువులలో 'ప్రౌఢ' సంభోగమునకు అనువైనది. ఏ ఋతువులోనైనా బాల రతికి యోగ్య మైనదే. వృద్ధస్త్రీ సంభోగమునకు నిషిద్ధం.

స్త్రీలకు ఆహార్యం ద్వారా కలిగే అలంకారాలు ఆకర్షణీయంగా ఉంటాయి. చేతి కడియాలు, నడుముకున్న వడ్డాణం, కాలికున్న చిరుగజ్జెలు చేసే సవ్వడులు రాజహంసల ధ్వనిని ఓడిస్తూ ఉంటాయి. ఈ ధ్వని, మృగాక్షుల క్రీగంటి చూపులు ఎంతటి పురుషుణ్ణయినా లోబరచుకుంటాయి.

స్త్రీలు తమ బంగారువన్నె శరీరానికి అనువైన జవ్వాజి, కస్తూరి, కుంకుమ మొదలగు సుగంధ ద్రవ్యాలను పూసుకొంటారు. ఇవి పురుషుని మనసును లోబరచు కొంటాయి. వారి చనుగుబ్బలపై కదిలే రత్నహారాలు, పాదనూపురాలు, జితేంద్రియులను కూడా ఆకర్షించి వశపరచుకొంటాయి.

కావ్యాలందు అట్టి శృంగార రసాధి దేవతలగు స్త్రీలను కవులు అబలలని వర్ణిస్తూ ఉంటారు. వారు వట్టి అజ్ఞానులు. ఎందుకంటే ఎందరో రాక్షసులను సంహరించిన ఇంద్రాది దేవతల్ని కూడా స్త్రీలు తమ చంచలమైన చూపులతో గెలువగలుగుతున్నారు. అటువంటి కామినులు ప్రబలలు అవుతారేకాని అబలలెలా అవుతారు?

అంతేకాకుండా మన్మథుడు స్త్రీలకు సేవకుడుగా ఉంటాడు. వారు ఎవరిని ఓరగంట చూస్తారో వారి దగ్గరకు మన్మథుడు వెళ్ళి, పురుషులను బాధిస్తూ ఉంటాడు. తప్పదు ఈ లోకంలో ప్రభువు పొమ్మన్నచోటికి పనివాడు వెళ్ళవలసినదే గదా! అలా వెళ్ళి ఎంతటి వాడినైనా హింసించి లోబరచుకుని తమ యజమాను రాలైన స్త్రీకి పురుషుణ్ణి బానిసగా మార్చే నమ్మినబంటు మన్మథుడు.

చక్కగా దువ్వి ముడివేసిన వెంట్రుకలు, చెవులవరకు విస్తరించిన కళ్ళు, తెల్లని కాంతులు వెదజల్లే పలువరుస, ముత్యాల దండలు ఎగబ్రాకిన కొండలవంటి చన్నులజంట, ప్రశాంతత కల్గి తేటగాఉన్న స్త్రీ శరీరం పురుషులకు అనురాగాన్ని పుట్టిస్తుంది.

సంయమనంగల్గి, వేదాంత విచారణ చేస్తూ జీవన్ముక్తులకు స్థానమై, వైరాగ్యంగల్గిన ప్రసన్నమూర్తులను చూసినపుడు, తాత్కాలికంగా నైనా వైరాగ్యం

కలుగుతుంది. కానీ స్త్రీ శరీరంలోని వెంట్రుకలందు సంయమనం, కళ్ళయందు శ్రుతిపారగత్వం, స్తనాలందు జీవన్ముక్తుల స్థానం ఉండినా స్త్రీ శరీరం విరక్తిని కలుగజేయకుండా అనురక్తినే కలిగిస్తుంది.

ముగ్ధలైన స్త్రీలు మంచి విలువిద్య తెలిసినవారు. లోకంలో ఏ విలుకాడైనా కంటికి కనిపించే లక్ష్యాన్ని మాత్రమే కొట్టగలదు. మనస్సు ఒక భావన మాత్రమే. కాబట్టి ఎంతటి విలుకాడైనా దాన్ని కొట్టలేదు. కానీ స్త్రీలు మాత్రం తమ రూప యవ్వనాలను బాణాలుగా చేసుకొని పురుషుల మనసులను ఛేదించగలరు. లేడిపిల్ల కన్నుల వంటి కన్నులుగల సుందరాంగి వలలో చిక్కినవానికి పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడు, నక్షత్రాలు, వేలకొలది దీపాలు వెలుగుతున్నప్పటికి ఆమె లేనప్పుడు ప్రపంచమంతా చీకటిల్లుగా ఉంటుంది. దీనినే మోహాంధకారమంటారు.

ఈలోకంలో గర్వంతో మిడిసిపడేవారు, ఇతరులకు కష్టాన్ని కలుగజేస్తారు. తామే ఎత్తైనవని గర్వించే స్త్రీలచన్నులు, తామే అందమైనవనుకొనే స్త్రీలకన్నులు, తమకంటే ఎర్రనైనవీ జగత్తులో లేవనుకొనే స్త్రీల పెదవులు పురుషుల్ని బాధించడం సహజమే. కాని మధ్యవర్తులుగా ఉండేవారు బాధించకూడదు కదా! అయిననూ స్త్రీల విషయంలో మధ్యవర్తిగా అంటే స్త్రీ శరీరం మధ్యలో ఉండే నూగారు మన్మధుని చేతివ్రాతవలే ఉండి తీవ్రమైన తాపాన్ని కలిగిస్తూ ఉంది.

సుందరీమణుల వెంట్రుకలు ఇంద్రనీలమణుల వలే నల్లనివి. వారి ముఖాలు చంద్రకాంత మణులవలే మనోహరాలు, వారి తామర తూడుల వంటి చేతులు పద్మరాగమణులవలే ఎఱ్ఱ వైనవి, పరిశీలించి చూస్తే యవ్వనవతి శరీరం మణులతో నిర్మించినట్లు ప్రకాశించుచున్నది.

అంతేగాక సుందరాంగి చన్నులందు గురుత్వం (పెద్దతనం) ఉన్నది. ఆమె ముఖం నందు చంద్రుడు కన్పిస్తున్నాడు. ఆమె నడక మందంగా ఉండుటచే శనైశ్చరత్వం కన్పించుచున్నది. మొత్తానికి ఆమె శరీరాన్ని బ్రహ్మ గ్రహకూటమితో తయారుచేసినట్లున్నాడు.

స్త్రీల గుబ్బలు గొప్పవిగా ఉన్నవని, నితంబాలు మనోహరంగా ఉన్నవని, ముఖం చక్కగా వున్నదని పురుషుల మనస్సులు కలవరపాటు చెందుతూ ఉంటాయి. వాటియందు కోరికగలవారు తపస్సు, దానం మొదలగు పుణ్యకార్యా

లను చేయవలెను. ఎందుకంటే స్వర్గం నందున్న రంభ మొదలగు అప్సరసలతో సుఖం కోసం యజ్ఞ యాగాదులు చేస్తున్నారు కదా! పుణ్యవిశేషం లేని పురుషునకు ఉత్తమ తరుణీ సంభోగం లభించదు.

స్త్రీల శృంగార చేష్టలు యవ్వనకాలంలో మిక్కిలి ప్రకాశిస్తూ ఉంటాయి. విస్తారమైన మరుకేళికి ప్రారంభదశను తెలియజేస్తాయి. మన్మథునికి జయంనిచ్చే నేర్పుగలగినవి. ఏవో తెలియని క్రొత్తక్రొత్త భావాల పుట్టుకకు కారణభూతమై తలచుకొన్న ప్రతిసారీ ఆనందాన్ని కలుగజేస్తూ ఉంటాయి.

స్త్రీల మాటలు ప్రణయ సమయంలో మనస్సులను కరిగిస్తాయి. ప్రేమను వెదజల్లుతాయి. శృంగారరసాన్ని పెల్లుబికేలాచేస్తాయి. సరసంగా ఉంటాయి. ఆనందాన్ని కలుగచేస్తాయి. మన్మథభావాన్ని ఉద్దీపనం చేస్తాయి. నర్మగర్భంగా ఉంటాయి. కాముకుల సర్వస్వాన్ని హరించివేస్తాయి.

ఇన్ని బలమైన కారణాలు, ఇంత సొబగైన సొగసైన ఆకర్షణ ఉన్న కారణం చేతనే సృష్టి నిరంతరాయంగా కొనసాగుతున్నది. భర్తృహరి శృంగార శతకంలోని మొదటి ఇరవై శ్లోకాలలో స్త్రీ ప్రశంస చేసి తరువాత ఇరవై శ్లోకాలలో సంభోగ వర్ణన చేశారు.

## సంభోగ వర్ణనము

స్త్రీలు సహజంగానే అందమైనవారు. ఆ అందం పురుషుణ్ణి ఆకర్షిస్తుంది. ఈ ఆకర్షణే సృష్టికి ఆలంబన. స్త్రీ – పురుషుల మధ్య శృంగారం యొక్క ప్రధాన ప్రయోజనం సృష్టి. కాని సంభోగ సమయంలో పొందే ఆనందాన్నే ప్రయోజనంగా భావించి, స్త్రీ పురుషులిద్దరూ శృంగారం కోసం తపిస్తూ ఉంటారు.

నవరసాల్లో ఎనిమిదింటిని ఆడవారుగాని, మగవారు గాని వేర్వేరుగా అనుభవించవచ్చు. కాని శృంగార రసానికి ఆడ, మగల భాగస్వామ్యం అవసరం. అందుకే దాన్ని రసరాజం అన్నారు. సంభోగం, యోగం ద్వారా పొందే సమాధి– ఈరెండూ మనిషికి సమానమైన ఆనందాన్నిస్తాయి. సమాధిలోనూ, సంభోగంలోనూ మనిషికి అహంకారం ఉండదు. అయితే సంభోగం వల్ల వచ్చే ఆనందం భౌతిక మైనది. తాత్కాలికం. సమాధివల్ల వచ్చే ఆనందం పారమార్థికమైనది. శాశ్వతం.

వెన్నెలరాత్రి. ప్రియుడు రాలేదు. ఆమె అందం వెన్నెల్లో కాగిపోతూ ఉంది. చంద్రుని కిరణాలు ఆమె స్తనాలను, ఆమె చిక్కిపోయిన నడుమును తాకుతున్నాయి. ప్రియుడుంటే ఆహ్లాదాన్నిచ్చే వెన్నెల అతడు లేనప్పుడు ఆమె నిగ్రహాన్ని కరిగిస్తూ ఉంది. పైటకొంగును వెన్నెలకు అడ్డుపెట్టి చెట్లచాటుకు పరుగులు తీసింది. కాసేపు విశ్రమించింది. ప్రియునికోసం మళ్ళీ వెన్నెట్లోకి వచ్చింది. వెతుకుతూ ఉంది. అతను రాలేదు. వెన్నెలవేడి. మరళా చెట్టు చాటుకు పరుగుదీసి విశ్రాంతి తీసుకొన్నది. ఆమె మనసు నిండా శృంగార భావనలే.

దీన్ని విప్రలంబ శృంగారం అంటారు. ఆ నాయిక విప్రలబ్ధ. తను కోరుకున్న నాయకుడు వచ్చి ఇద్దరూ శారీరకంగా కలిస్తే దాన్ని సంభోగ శృంగారం అంటారు. ఇలా శృంగారం రెండురకాలుగా ఉంటుంది. భర్తృహరి ఒకశ్లోకంలో విప్రలంబ శృంగారాన్ని వర్ణించి అటుపై సంభోగ శృంగారాన్ని విస్తారంగా వర్ణించాడు.

మెరుపుతీగ వంటి శరీరం కలిగిన అమ్మాయిని పురుషుడు చూస్తాడు. ఆమె తనను చూస్తే బాగుంటుందని కోరుకొంటాడు. ఆమె చూస్తుంది. అప్పుడు ఆమెను కౌగిలించుకోవాలనే కోరిక కలుగుతుంది. కౌగిలించుకొంటాడు. కౌగిలిలోనుండి విడిపోక సంభోగ సుఖం కోరుకొంటాడు.

నిజానికి జాజిపూల మాలలు జడలో తురుముకొని, కుంకుమ కలిపిన గంధం పూత పూసుకొని అలంకరించుకొన్న యవ్వనవతి కౌగిలే స్వర్గం. నల్లటి, పొడవాటి జడతో, విస్తారమైన తామరరేకులవంటి కన్నులు గలిగిన ప్రియురాలి వక్షస్థలంలో సేదదీరడం కంటే పురుషునికి వేరొక ఇంద్రభోగం లేదు. యవ్వన మదంచే సోలిపోయే ప్రియురాలి కౌగిలిలో ఉండేవాడు ఈలోకంలోనే స్వర్గసుఖాలను అనుభవిస్తాడు.

ప్రియుని కౌగిలిలో ఉన్న ముగ్ధనాయిక అతనితో 'వద్దు, వద్దు' అంటుంది. ఏది వద్దో, ఎందుకు వద్దో చెప్పదు. ప్రియుణ్ణి విడువదు. ప్రియుడు కూడా ఆగడు. ఆమెలో అభిలాష కలుగుతుంది. కుంచించుకు పోయిన అవయవాలను వదులు చేస్తుంది. అలా చేసినందుకు సిగ్గుపడుతుంది. తరువాత తన శరీరముపై పట్టును కోల్పోతుంది. అతణ్ణి ఎదుర్కొనే ధైర్యాన్ని కోల్పోతుంది. అప్పటికి సంభోగాని కున్న అడ్డంకులు తొలగిపోతాయి.

ఆమెకు అతనిపట్ల ప్రేమ కలుగుతుంది. తను ఆనందిస్తుంది. తాను కూడా ఆ రహస్య క్రీడలో ఏకాంతంలో భయంలేకుండా తన ప్రాగల్భ్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆ దశలో సిగ్గు ఉండదు. ఇటువంటి స్త్రీ సంభోగం మిక్కిలి సౌఖ్యాన్నిస్తుంది. జారస్త్రీలతో ఇటువంటి సౌఖ్యం వీలుకాదు.

సిగ్గు, బిడియం, భయం, అవగాహనా రాహిత్యం రతికి ఆటంకాలు. కామ తంత్ర నిపుణుడు, అనుకూలుడైన నాయకుడు వాటిని తొలగించాలి. సిగ్గు, బిడియం పోయిన స్త్రీలు పురుషుడు అలసిపోవడం చూసి, ఇంకా తమలో రగులుతున్న కోర్కెలను చల్లార్చుకోవడం కోసం పురుషుని పైకి చేరుతారు. అతని వలే రతిని ఆరంభిస్తారు. దీనిని ఉపరతి లేదా పురుషాయతనం అంటారు.

ఆమె యవ్వన సంపద అతని రొమ్మును ఢీకొడుతూ ఉంటుంది. ఆమె జడ ఊడి వెంట్రుకలు విచ్చలవిడిగా ఆడుతుంటాయి. అవి నాయకునికి గిలిగింతలు పెడుతూ ఉంటాయి. అనిర్వచనీయమైన సుఖ పారవశ్యంతో ఆమె కన్నులు సగం మూతబడి ఉంటాయి. చలికాలమైనా సరే ఆమె శరీరం నుండి చెమట పుడుతుంది. అది కమ్మని వాసన కలిగి ఉంటుంది. ఆమె బుగ్గలపై నుండి చెమటకారుతూ ఉంటుంది. ఏం చెయ్యాలో తెలియని నాయకుడు ఆమె ముఖం తన ముఖానికి అభిముఖంగా ఉన్న కారణంచేత ఆమె క్రింది పెదవిని గాఢంగా ముద్దాడుతాడు. ఉపరతి చేస్తున్న స్త్రీ అధరామృతాన్ని భాగ్యవంతులు మాత్రమే గ్రోలగలరు. ఇటువంటి సుఖం అందరికీ దొరకదు.

ఆ సందర్భములో స్త్రీ పురుషులిద్దరూ అరమోడ్పు కన్నులతో ఉన్నా వారు పరస్పర అవగాహనతో, తెలివితో ఉండాలి. అలా తెలివితో పరస్పర సహకారంతో జరిగిన సంభోగం కామ పురుషార్థ సాఫల్యంగా రసజ్ఞులు నిర్ణయించారు. అనగా రతివిజ్ఞానము లేనివారితో, ఇష్టంలేని వారితో, స్పృహలో లేనివారితో, నిద్ర మొదలగు అలౌకిక స్థితిలో ఉన్నవారితో సంభోగం రసభంగం, పాపమౌతుందే గాని పురుషార్థం కాదు. కామం ధర్మబద్ధంగా తీర్చుకోవాలి.

మనిషి మనసు కోరికలతో నిండి ఉంటుంది. యవ్వనంలో ఆ కోరికలను తీర్చుకోవడానికి శరీరం సహకరిస్తుంది. ముసలితనంలో కూడా పురుషునికి కోరికలు కలుగుతుంటాయి. చన్నులు దృఢత్వాన్ని కోల్పోయి, జారిపోయిన పిమ్మట కూడా

స్త్రీలకు కోరికలు కలుగుతుంటాయి. యవ్వనం ఉన్నవంతవరకే, కోరికలు గాని, జీవితంగాని ఉన్నట్లయితే ఉచితంగా ఉండేదేమో! ఎందుకంటే ముసలితనంలో కోరికలు నిరాశకు కారణమౌతాయి కదా!

ఒక రాజు కొంతమంది యువకులను దూరదేశం నుండి బందీలుగా తెచ్చాడు. వారు రాజుకు బానిసలు. రాజప్రతినిధులు చెప్పే పనులన్నీ చేసేవారు. ఒకరోజు రాజు వారికి కనిపించాడు. వారందరూ అతని దగ్గరికి వెళ్ళి నమస్కరించారు. రాజు ఏమిటన్నట్లు చూశాడు. వారిలో ఒకడు ధైర్యం చేసి ముందుకు వచ్చాడు. రాజుతో "ఓరాజా! మనిషి ఆశ సముద్రం వంటిది. ఆశ తీరిన వాడు, సముద్రాన్ని ఈదిన వాడు ఈలోకంలో లేడు, ఇప్పుడు మేమంతా యవ్వనంలో ఉన్నాం. మాకందరికీ భార్యలున్నారు. వారు మంచి అందగత్తెలు. వారికన్నులు విచ్చుకొన్న కలువలు, వారి చన్నులు విచ్చుకొనని కలువలు. మీ సేవలో మాయవ్వనం జారిపోయిన తర్వాత మేం వారితో ఎలా సుఖం అనుభవించ గలం? మీరిచ్చే బహుమానాలు, ధనం మాకోర్కెలను ఎలా తీర్చగలవు? మా భార్యల యవ్వనం కూడా జారిపోతున్నది. కాబట్టి ఓ రాజా! నీవు నీ సేవకుల సుఖం కోరుకునే మాట నిజమైతే మమ్మల్ని మా భార్యలను చేరుకోవడానికి అనుమతించండి" అన్నాడు. రాజు వారి ధైర్యానికి ఆశ్చర్యపోయాడు, ఆలోచించాడు.

యవ్వనం ఆశకు ప్రధానస్థానం, ధైర్యాన్నిస్తుంది. అనేక పాపాలను చేయిస్తుంది. మనిషిని తీరని వ్యసనాలకు బానిసను చేస్తుంది. ఆకర్షణకు అదే విత్తనం. జ్ఞానమనే చంద్రుణ్ణి కనిపించనీయకుండా చేసే మేఘాలగుంపు యవ్వనం. అది మన్మథునికి స్నేహితుడు. మంచిపనులను వద్దంటుంది. చెడును దగ్గరుండి చేయిస్తుంది. అన్ని దుర్మార్గాలకు పుట్టినిల్లు యవ్వనమే.

మేఘం వర్షించి విత్తనాలను మొలకెత్తునట్లు చేస్తుంది. అటుపై ఆ మొలకలు మొక్కలుగా, చెట్లుగా, మహావృక్షాలుగా ఎదుగుతాయి. యవ్వనం శృంగారమనే విత్తనాన్ని మానవుని హృదయంలో నాటుతుంది. మన్మథ ఉద్రేకాన్ని కలుగజేస్తుంది. ముత్యాలవరుసవంటి సరసమైన మాటలను నేర్పుతుంది. యవ్వనప్రాభవంతో కృశించిపోయిన నడుములు గల స్త్రీల కన్నులనే చకోరపక్షులకు మగవారి యవ్వనం పున్నమిచంద్రుని వంటిది. స్త్రీల యవ్వనం సౌందర్యాల గని. అటువంటి యవ్వనం

వచ్చినప్పుడు ప్రతిఒక్కరు కామభావాలకు లోనౌతూ ఉంటారు. అలా చలించని వాడెవడైనా ఉంటే అతడు పుణ్యాత్ముడే!

ఎంతోమంది విద్యావంతులు రాజులవద్ద ధనంకోసం పనిచేస్తూ ఉంటారు. ఆ రాజసేవ ఎంతో కష్టంతో కూడుకొన్నది. మనసును బాధ పెడుతుంది. ఆత్మాభిమానాన్ని దెబ్బతీస్తుంది. అటువంటి స్థితిలో వారికి సేవపట్ల అసహ్యం కలుగుతుంది. మనసు కలవరపాటుకు లోనవుతుంది. సంసారం నిస్సారంగా తోస్తుంది. సాయంకాలం ఇంటికి చేరుకొంటారు. తలుపుతీస్తుండగా వారి భార్యల నితంబాల పైభాగాన ధరించిన చిరుగజ్జెల మ్రోత వినిపిస్తుంది. తలుపు తీయగానే వారి కమలనేత్రాలు కన్పిస్తాయి. వారు కట్టుకొన్న చీరల కాంతి ఆకట్టుకొంటుంది. వారు పూసుకొన్న సుగంధపువాసన ఆకర్షిస్తుంది. యవ్వనభారంచేత కొంచెం వంగినట్టు కన్పించే వారి నడుము లోపలికి భర్తను రమ్మంటుంది. పండితుడు పనిలో భారం మర్చిపోతాడు. సుఖాల తీరం చేరిపోతాడు. మన్మథుడుగా మారిపోతాడు. మరుసటిరోజు ఉదయం మళ్ళీ రాజుగారి సేవకు బయలు దేరుతాడు. నిస్సారమైన సంసారంలో సారవంతమైన మజిలీ సంభోగం మాత్రమే.

ఇంటివద్ద మన్మథబాణం వంటి స్త్రీలు లేకపోతే పురుషుడెవడూ రాజు పాదాలకు మ్రొక్కడు! హిమాలయాలకు వెళ్ళిపోతాడు. అక్కడ గంగచే కడుగ బడిన ఊతి ప్రదేశాలున్నాయి. శివుని ఎద్దు మూపురం రుద్దుకొన్న చెట్లున్నాయి. సిద్ధులు తపస్సు చేసుకొనే గుహలున్నాయి. అటువంటి చోట ప్రశాంతంగా తపస్సు చేసుకోక రాజుల సేవలో ఉండటం ఎందుకంటే సంభోగసుఖం లభిస్తున్నందు వల్లనే.

సంసారాన్ని దాటడం చాలాసులభం. అయితే స్త్రీలు ఎదురుపడకుండా ఉండాలి. వారి కాటుక పిట్టల వంటి కంటిచూపు మగవారిపై పడకుండా ఉండాలి.

మానవుడు జీవితంలో రెండురకాలుగా ఉండటానికి అవకాశం ఉన్నది. అవి సంసారం పట్ల అనురక్తుడై ఉండటం లేదా విరక్తుడై ఉండటం. నిజంగానే విరక్తి పుడితే అరణ్యానికి వెళ్ళి జింకపిల్లలను మచ్చిక చేసుకొని, కత్తెర రాళ్ళతో దర్భమొలకలు కోసి వాటికి తినిపించాలి. విరక్తి కలుగకుండా అరణ్యానికి చేరితే, సన్యాసం స్వీకరిస్తే ప్రయోజనం లేదు. శకదేశంలో స్త్రీలు చాలా అందంగా

ఉంటారు. వారి బుగ్గలు లేత తమలపాకులవలే ఉంటాయి. సంసారం పట్ల అనురక్తి ఉంటే ఇంటిదగ్గరే ఉండాలి. శకదేశపు స్త్రీ చెక్కిలి వంటి తమలపాకులతో చిలకలు చుట్టాలి. తన ప్రియురాలికి అందించాలి. అంటే ప్రతిఒక్కరికీ తమ జీవితం పట్ల స్పష్టత ఉండాలి. సంసారంలో ఉంటూ సంసారాన్ని చీదరించుకోరాదు. సన్యాసం స్వీకరించాక సంసార సుఖాలకు ఆకర్షితుడు కాకూడదు. ఒకవేళ ఆకర్షితుడైతే ధైర్యంగా సన్యాసాన్ని వదలి సంసారాన్ని స్వీకరించాలి. అంతేగాని సన్యాసిగా ఉంటూ సంసారం చేయడం తగదు.

సంసారం మొదట తీపిగా ఉంటుంది. రాను రాను చేదెక్కుతుంది. అనేక కష్టాలకు సంసారమే మూలకారణం. కానీ, పుణ్యం సంపాదించుకోవడానికి కారణమైన పరోపకారం సంసారంలోనే సాధ్యమౌతుంది. సంభోగమనే స్వర్గ సుఖంలో ఓలలాడించే మనోహరమైన వస్తువు ఒక్క స్త్రీ మాత్రమే.

ప్రజలకు ప్రబోధం చేసేవారు సంసారుల మధ్యకూర్చొని సంసారం సారహీనమని చెప్పడం అర్థరహితం. ఒక వ్యక్తి ఎత్తైన పర్వత సానువులను ఆశ్రయించాలా? లేకపోతే ఎత్తైన పిరుదులు గల స్త్రీ సాంగత్యాన్ని కోరుకోవాలా? ఏది సుఖం? పండితులైన వారు పామరులకు ఈ విషయాన్ని విడమర్చి చెప్పాలి.

స్త్రీల దృఢమైన జారిపోని స్తనాలు, వెడల్పైన నితంబాలు, పలుచని నడుము, సున్నితమైన మర్మస్థానం మొదలగు వాటిని తాకుతూ, సంభోగించాలనే కోరికగల యవ్వనవతులతో రతిసౌఖ్యం లనుభవించాలి. లేదా అంతే ఆసక్తితో పరబ్రహ్మ విచారమునందు మనస్సును లగ్నంచేసి బ్రహ్మానందాన్ని పొందాలి. తత్త్వజ్ఞానం లేనివారికి స్త్రీలే దిక్కు. వారివలన ఇహలోకసౌఖ్యం కలుగుతుంది లేదా గంగానదీ తీరంలోని పుణ్యక్షేత్రాలను సేవిస్తే పాపం నశించి, పరలోక సౌఖ్యం కలుగుతుంది.

వట్టిమాటల వలన ప్రయోజనం లేదు, ప్రయోజన వంతమైనవి రెండే రెండు. స్త్రీల యవ్వనం, తపోవనం. వైరాగ్యం కలిగినప్పుడు తపోవనం సుఖాన్నిస్తుంది. వైరాగ్యం లేనప్పుడు స్త్రీ కంటే సుఖాన్నిచ్చే వస్తువేదీ ప్రపంచంలో లేదు. విరక్తి కలిగితే స్త్రీ కంటే దుఃఖహేతువు మరొకటి లేదు.

ఈ విషయం పట్ల స్పష్టత లేని సన్యాసులను మనం ఈనాటి సమాజంలో చూస్తున్నాం. వారు వట్టి చవట సన్నాసులు. సంసారంలో స్త్రీ ఒక తియ్యని

మజిలీ. సంభోగం అత్యున్నతమైన ఆనందాన్నిచ్చే ఒక అద్భుతం. దానికున్న పరిధులను అతిక్రమించకుండా సుఖించడమే కర్తవ్యమని భర్తృహరి తెలియజేశారు. తరువాత 'కామినీ గర్హణము'ను గూర్చి ప్రవచిస్తారు.

## కామినీ గర్హణము

స్త్రీలు సౌందర్యాల గనులు. వారు ఒలకబోసే వయ్యారాలు ఆకర్షణీయంగా ఉంటాయి. ఎటువంటి వారినైనా కట్టిపడేస్తాయి. ఒక పండితుడున్నాడు. అతను సకల శాస్త్రాలు చదువుకొన్నాడు. అతనికి ఏది సత్యం, ఏది అసత్యం? అనే వివేకం అబ్బింది. స్త్రీ శరీరం ఒక తోలుబొమ్మ. అది అన్నిజీవుల శరీరాల్లాగే పంచభూతాలతో నిర్మాణమైంది. అదికూడా మార్పుకులోనౌతుంది. అదికూడా ముసల్దవుతుంది. ఆ శరీరంలోకూడా మలమూత్రాలున్నాయి. ఆ శరీరం కూడా మరణాన్ని పొందుతుంది. ఇది సత్యం. ఈ వివేకం, ఈ విజ్ఞానం పండితునికి ఉన్నది.

అతడు ఒకనాడు ఒక యవ్వనవతియైన స్త్రీని చూశాడు. ఆమెకన్నులు కలువ రేకుల్లా ఉన్నాయి. ఆమె ముఖం అప్పుడే వికసించిన తామరలా వెలుగుతోంది. ఆమె కనుబొమలు తుమ్మెద బారులా సొగసుగా ఉన్నాయి. ఆమె ఎత్తైన చనుకట్టు ఏదో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆమె వెడల్పైన పిరుదుల భారం అతని మనసును గుటకలు మ్రింగించింది. ఆమెపట్ల అతను ఆకర్షితుడైనాడు. ఆమె జారస్త్రీ. ఆమెతో రమించాడు. ఆ క్షణంలో అతని పాండిత్యమంతా ఆమె శరీర సౌష్ఠవాన్ని వర్ణించడానికి సరిపోయింది. అంతకు ముందువరకు మలమూత్రాలతో నిండిన తోలుబొమ్మ అతణ్ణి సుఖాలతీరం చేర్చింది. స్త్రీల పట్ల ఆకర్షితుడైన ఏపండితుడైనా ఇంతే. అతడు ఆమెను తన ప్రియురాలనుకొన్నాడు.

ఆమెను తలచుకోగానే మనసు అశాంతికి లోనవుతుంది. ఆమెను చూడగానే ఏదో తెలియని మత్తు ఆవహిస్తుంది. ఆమెను తాకగానే తనచుట్టూ ఉన్న ప్రపంచాన్ని మర్చిపోతాడు. ఏది సరైనదో, ఏదికాదో తెలియని స్థితిలో మునుగుతాడు. ఆమెను గూర్చి ఆలోచించినది మొదలు అతనిలో ఆందోళనే. కాని ఆమెను మాత్రం అతడు విచిత్రంగా 'ప్రియురాలు' అంటుంటాడు. ప్రియురాలంటే దుఃఖాన్ని కలిగించేదా?

ఆమె ఎదుట ఉన్నప్పుడు అతనికి తనముందు అమృతభాండం ఉన్నట్లు తోచేది. ఆమె క్రింది పెదవి అంచుద్వారా అతను అమృతాన్ని త్రాగేవాడు. కాలాన్ని మర్చిపోయేవాడు. ఆమె వెళ్ళిపోయేది. అతను ఆమె ఆలోచనలతో వేగిపోయేవాడు. శరీరం వేడెక్కేది. మనసు బరువెక్కేది. ప్రాణాలు పోతాయనిపించేది. సుందరాంగి దూరమైతే భరించడం ఎంతకష్టం?

ఆమె అతనిపై అనురాగాన్ని చూపేది. ప్రేమను గుప్పించేది. అప్పుడు ఆమె అమృతఫలాన్ని కాసే తీగె. ఒక్కోసారి ఆమె అతనిపట్ల ప్రేమను చూపేదికాదు. విసుక్కొనేది. చీదరించేది. దాక్కునేది. అప్పుడు ఆమె అతనికి ఒక విషపు తీగెలా తోచేది. ఆమెను నిందించలేడు కదా! అందుకే ఆమెను తయారుచేసిన మాయగాణ్ణి నిందించేవాడు. "ఛీ! ఛీ! ఈ జారస్త్రీలు అనుమానాల సుడిగుండాలు, వినయం లేని భవనాలు, సాహసాల పట్టణాలు, దోషాలకు పుట్టినిండ్లు, వందలకొలది మోసాలకు శరీరం వంటివారు. అపనమ్మకాల క్షేత్రాలు, స్వర్గద్వారానికి ఆటంకాలు, నరకానికి ప్రవేశద్వారాలు, మాయల భరిణెలు, అమృతరూపమైన విషం, సకల ప్రాణులకు ఉరిత్రాడు వంటివారు. అటువంటి స్త్రీ యంత్రాన్ని ఏమాయగాడు చేశాడో కదా!"

వాస్తవంగా చూసినపుడు చంద్రుడు ఆమె ముఖంగా మారలేదు. నల్ల కలువలజంట ఆమె కన్నులు కాలేదు. ఆమె శరీరం బంగారుతో చేయబడలేదు. ఇవన్నీ పండితునికి తెలుసు, అయినా కవులు ఆమెను చంద్రముఖి, కలువకంటి, కనకాంగి అని వర్ణిస్తూ ఉంటే విని మోసపోయాడు. నిజానికి వారిశరీరాలు కూడా రక్తమాంసాలతో నిండినవే కదా!

తామర పువ్వు సహజంగానే ఎర్రగా ఉంటుంది. కానీ తుమ్మెద మాత్రం తనమీద అనురాగంతో అది ఎర్రగా మారిందని అనుకొంటుంది. జారస్త్రీ ఒయ్యారాలను, ఒంపుసొంపులను, అలంకారాలను తనకోసమే ప్రదర్శిస్తోందని అతను అనుకొంటాడు. అదంతా వెట్టి. జారస్త్రీలకు అవన్నీ సహజలక్షణాలే. మూర్ఖులైన వారు ఈ వాస్తవాన్ని తెలుసుకోలేరు.

ముష్టిపండు బంగారు వన్నెతో గుండ్రంగా నున్నగా ఉంటుంది. ఆకర్షణీయంగా ఉంటుంది. కానీ అది తినడానికి యోగ్యమైనదికాదు. విషపూరిత

మైనది. పున్నమి నాటి చంద్రుని తలదన్నే ముఖం గల్గిన అందగత్తెలుంటారు. వారి యవ్వనం ఆకర్షణీయంగా ఉంటుంది. వారితో సంభోగం సౌఖ్యంగా ఉంటుంది. కానీ యవ్వనం గడిచేకొద్దీ వారితో సాంగత్యం దుఃఖదాయినిగా మారుతుంది.

స్త్రీ ఒక నది, ఆమె నడుంమీద పడే మడతలు ఎగసిపడే అలలు. ఆమె చన్నుల జంట చక్రవాకపక్షుల జంట, ఆమె ముఖం వికసించిన తామరపుష్పం. మొసళ్ళు మొదలగు క్రూరజంతువులు ఆమె మనస్సు. ఈ స్త్రీ అనే నది పురుషుని సంసారమనే సముద్రానికి తీసుకెళ్ళి ముంచుతుంది. సంసార సాగరంలో మునగరాదని భావించేవారు స్త్రీలకు దూరంగా ఉండాలి.

పండితుడు ఆమె తనను బాగా ఇష్టపడుతోందని భావించాడు. ఆ జారస్త్రీ ఒకనాడు వేరొకనితో ప్రేమమీర మాట్లాడుతూ వీధిలో వెళ్ళుతున్న ఇంకొకనికి తన హొయలు చూపుతూ కనిపించింది. మనసులో మరొక్కడు ఉండే ఉంటాడు. అప్పుడు పండితుడు. జారస్త్రీలకు ఏ పురుషుని పట్ల ప్రేమ ఉండదని, వారు అనేక మంది పురుషులను కోరుకొంటారని తెలుసుకొన్నాడు.

ఒకనాడు ఆ పండితుని కడకు ఒక స్నేహితుడు వచ్చాడు. తననో స్త్రీ ప్రేమిస్తున్నదని తెలియజేశాడు. పండితుడు చిరునవ్వు నవ్వి "మిత్రమా! స్త్రీల కడగంటి చూపులు ఆకర్షణీయంగా ఉంటాయి. కానీ, విషపూరితమైన నిప్పులు క్రక్కుతూ ఉంటాయి. ఆడది ఒక పాము వంటిది. స్త్రీ అందచందాలే పడగలు. పాముకు దూరంగా ఉన్నట్లే జారస్త్రీలకు దూరంగా ఉండాలి. పాము కాటువేసి నపుడు మంత్రగాళ్ళు మూలికలు తెచ్చి, చికిత్స చేస్తారు, విషవేగాన్ని తగ్గించి, గాయం మాన్పుతారు. కాని, నెరజాణ యైన కామిని అందచందాల కాటుకు గురియైన వాణ్ణి, వైద్యులు సమీపించరు. ఎందుకంటే ఆ మత్తు దిగేది కాదు, ఆ విషం వదిలేదు కాదు.

అంతేకాదు మిత్రమా! మన్మథుడొక జాలరి. సంసారం ఒక సముద్రం. స్త్రీయే గాలం. ఆస్త్రీ యొక్క ఎఱ్ఱటి పెదవులే గాలానికి గుచ్చిన ఎర, స్త్రీల ఎర్రటి పెదవుల్ని ముద్దాడాలనుకొనే ముద్దాయిలంతా గాలంలో చిక్కి కాలక్రమంగా

సముద్రపు నడిబొడ్డున మునిగిపోతారు. అలా దొరికి పోయినవాణ్ణి మన్మథుడు విరహమనే నిప్పులపైవేసి కాలుస్తాడు" అన్నాడు.

పండితుని మాటలు అతని స్నేహితునికి సబబుగానే అనిపించాయి. కాని మనస్సు ఆ కామిని వైపుకు లాగుతోంది. అతను మనస్సుతో "ఓ మనసా! నీవొక బాటసారివి! స్త్రీ శరీరమనే అడవిలోనికి ప్రవేశించకుము! ఆ అడవిలో చన్నులనే ఎత్తైన గుట్టలున్నాయి. వాటి చాటున నక్కి మన్మథుడనే దొంగ ఉన్నాడు. వాడు నిన్ను మెల్లమెల్లగా లాక్కొని అడవి మధ్యలోనికి తీసుకెళ్ళి పోతాడు" అని తన మనస్సును సమాధాన పర్చుకొన్నాడు.

పాము కరచినా ప్రమాదం లేదు కాని, జారస్త్రీ చూపు మాత్రం పాముకాటు కంటే ప్రమాదకరమైనది. వారి కంట పడకుండా ఉండటమే ఉత్తమం.

పండితుడు తన గత జీవితాన్ని ఒకసారి నెమరువేసుకొన్నాడు. ఆమె మాటలను పాటలుగా భ్రమించి అతని చెవులు వినడానికి ఆరాటపడేవి. ఆమె నడకను నాట్యంగా భావించి, ఆమె నడుస్తుంటే చూడాలని కన్నులు ఉబలాటపడేవి. తీపి అంతా ఆమె పెదవి యందే ఉన్నదని, దాన్ని రుచి చూడాలని అతని నాలుక ఉవ్విళ్ళూరేది. ఆమె నోటి నుంచి వెలువడే కర్పూర తాంబూళ సువాసనల్ని వాసన చూడాలని అతని ముక్కు ఆశపడేది. ఆమె బిగువైన చనుమొనల రాపిడికోసం అతని ఎద తొందరపడేది. ఇలా పంచేంద్రియాలు ఆమెచుట్టూ పరిభ్రమించాయి. స్త్రీలోలుడై పరమార్థాన్ని తెలుసుకోలేక పోయాడు. భగవంతుని గూర్చిన చింతన మర్చిపోయాడు.

ఈ వ్యామోహం నుండి బయటపడేదెలా? ఈరోగం మంత్రాలకు లోబడదు. ఔషధాలతో కుదరదు. ఎన్ని శాంతికర్మలు చేసినా నయం కాదు. శరీరం వశం తప్పుతుంది. చెమటలు పోస్తాయి. కాళ్ళుచేతులు వణుకుతాయి. మనస్సు కుదుటపడి, మనస్సు నుండి ఆమె ప్రతిబింబం దూరమైతే తప్ప ఈరోగం కుదుట పడేది కాదని పండితుడు తెలుసుకొన్నాడు. అనురాగం ఉన్నవస్తువు మనస్సులో ఉంటుంది. ఆసక్తిలేని విషయం మనస్సు నుంచి దూరమౌతుంది. అందుకే పండితుడు వెలయాలు ఎంతటి దుర్మార్గమైనదో గుర్తు తెచ్చుకొంటున్నాడు.

“జారస్త్రీలు డబ్బుకోసం పుట్టుగ్రుడ్డి, వదరుబోతు, ముసలివాడు, సంస్కార హీనుడు, కులభ్రష్టుడు, కుష్ఠరోగి ఇలా ఎవరైనా సరే వారికి పక్క పంచుతారు. కల్పలత వంటి జ్ఞానానికి చురకత్తుల్లాంటి ఈ భోగపు స్త్రీలపై వివేకవంతుడెవడూ ఆసక్తిని చూపడు.

అగ్నిలో వేసిన పదార్థాలు కాలి రూపుమాసిపోతాయి. జారస్త్రీ ఒక మథనాగ్ని జ్వాల. ఆమెకోసం వినియోగించిన ధనం, వయస్సు మాయమై పోతాయి. ఆరోగ్యం క్షీణిస్తుంది. శరీరం నిండా రోగాలు పుట్టుకొస్తాయి. కీర్తి నశిస్తుంది. గౌరవం పోతుంది. సంసారం ముక్కలౌతుంది. మరొక్క ధనవంతుడు కనిపించగానే వెలయాలు పాతవాణ్ణి ఛీకొడుతుంది. దూరంగా తరిమివేస్తుంది.

అంతేకాదు, వేగులు, బంట్లు, దొంగలు, తార్పుడు గాండ్లు, నటులు, విటులు ఇలా ఒకరేమి? హీనాతి హీనులంతా ఎంగిలిచేసిన వేశ్యల పెదవులు ఎంత ఆకర్షణీయంగా ఉన్నా బుద్ధి కలిగిన వాడెవడూ వాటిని ముద్దాడాలని కోరుకొనడు.

జారస్త్రీల మాటల్లో తేనెలూరుతూ ఉంటాయి. గుండెనిండా విషం ఉంటుంది. అందుకే పురుషులు వారి పెదవుల్ని ముద్దాడుతారు. రొమ్మును పిడికిళ్ళతో మర్దన చేస్తారు.”

ఇలా పండితుడు జారస్త్రీల సంభోగం వలన కలిగే నష్టాలన్నీ గుర్తుకు తెచ్చుకొని విరక్తుడై తన జీవితాన్ని సుఖమయం చేసుకొన్నాడు.

‘శృంగారానికి జారస్త్రీలు అనుకూలమైన వారేకదా! శృంగార శతకం మధ్యలో వారిని నిందించడం రసభంగం కదా!’ అనే సంశయం రావచ్చు. భర్తృహరి ఆరోగ్యకరమైన శృంగారానికి పెద్దపీట వేశాడు. శృంగారం అంటే పశుపక్ష్యాదుల్లో వలే ఉండరాదని, ధర్మబద్ధంగా జరగాలని ఆయన భావించాడు.

స్త్రీలను సౌందర్య గనులుగా భావించిన పండితుడు, జారస్త్రీ వ్యామోహాన్ని వదలడం మనం చూశాం. ఈ విరక్తి నిజమైనదేనా? ఇది శాశ్వతంగా ఉంటుందా? తాత్కాలికమా?

## విరక్త పద్ధతి

ఏదైనా ఒక వస్తువును కావాలనుకోవడం ఆసక్తి. వద్దనుకోవడం విరక్తి. మానవునికి మేలుకలిగించే విషయంపట్ల ఆసక్తి ఉంటుంది. కీడు కలిగించే విషయం పట్ల విరక్తి ఉంటుంది. ఇది సాధారణ నియమం. దీనికి అతీతమైన విషయం ఒకటుంది. అదే కామినుల వ్యవహారం. జారస్త్రీలు అందంగా ఉంటారు, ఒకవేళ లేకపోయినా ఆకర్షణీయంగా కనిపించడానికి ప్రయత్నిస్తారు. వారివల్ల పురుషునికి తాత్కాలికంగా సుఖం లభించవచ్చు, కాని కీడు శాతమే ఎక్కువగా ఉంటుంది.

యవ్వనంలో ఉన్నప్పుడు విరక్తి కలుగదు. వయసుమీరిన తర్వాత ఆసక్తి ఉన్నా శరీరం సహకరించదు. అయితే యవ్వనంలో విరక్తి కలగాలి. విరక్తి కలగడం అంటే స్త్రీలను ద్వేషించడం కాదు. వారికి దూరంగా ఉండటం కాదు. కులస్త్రీలకు దగ్గర కావడం, కులటలకు దూరంగా ఉండటం. ఫలానా దేశమని కాకుండా ప్రపంచమంతా తీవ్రమైన సుఖరోగాలతో కుళ్ళుతున్న ఈనాటికి ఆచరణీయమైన పరిష్కారం ఇదే.

విరక్తి కలిగిన వాడు విరక్తుడు. విరక్తి రెండురకాలు. ఎటువంటి ప్రలోభాలకు లొంగకపోవడం సువిరక్తి. అది కలిగిన వారు సువిరక్తులు. కొందరు విరక్తి నటిస్తారు. బోధిస్తారు. కానీ చాటుమాటు వ్యవహారాలు సాగిస్తారు. పట్టుబడితే ఏదేదో చెప్పి తమను తాము సమర్థించుకోవాలని చూస్తారు. అది దుర్విరక్తి. వారు దుర్విరక్తులు.

సువిరక్తులు పుణ్యాత్ములు, స్త్రీలకు తెల్లతామర రేకుల వంటి విస్తారమైన కన్నులుంటాయి. యవ్వనం పొంగుతున్న దట్టమైన, పెద్ద పెద్ద స్తనాలుంటాయి. వారి పలుచని నడుము మీద అందమైన ముడుతలుంటాయి. అవి పురుషుణ్ణి ఆకర్షిస్తాయి. అనుభవించమంటాయి. ఈ ఆకర్షణకు లోనుకానివారు పుణ్యాత్ములు. ఆకర్షితుడు కాకపోవడం సువిరక్తి.

ఒకానొక పండితుడు జారస్త్రీల వల్ల కలిగే కీడును తెలుసుకొన్నాడు. అతనిలో విరక్తి ప్రవేశించింది. ఒకసారి ఒక వయ్యారి అతనిని చూసింది. తన కన్నుల్ని అరమోడ్చింది. కొన్ని మన్మథసంకేతాలను పంపింది. అవన్నీ సంభోగానికి అనుకూలమైన సంకేతాలే. ఆమెను జూచి ఆ పండితుడు లోలోన నవ్వుకొన్నాడు.

ఆమె ప్రయత్నాలకు అతనికి జాలి కలిగింది. ఆమెను సమీపించాడు. ఆమె ఆనందించింది. కాని అతడు ఆమెతో "అమ్మా! ఇంకా శ్రమపడకు, నేను మునుపటిలా లేదు. నాలో యవ్వనం తగ్గిపోతూ ఉంది. అరణ్యాలకు వెళ్ళి తపస్సు చేసుకోవాలనే కోరిక పెరుగుతున్నది. నీవంటి వారిపట్ల వలపు లేదు. నాకు ఈ ప్రపంచం గడ్డిపోచవలే కనిపిస్తూ ఉంది. ఆసక్తి లేదు. ఇక నీ ప్రయత్నాలు విరమించుకో" అన్నాడు.

ఇంతలో అతని స్నేహితుడు వచ్చాడు. 'మిత్రమా! ఎవరావిడ! ఆమె కథేంటి?' అని అడిగాడు "స్నేహితుడా! ఈమెను చూశావా? ఈమె కళ్ళను చూశావా? ఈమె పదే పదే చూపుల బాణాలు వేస్తూఉంది. అలాచేయడంలో ఆమె అభిప్రాయం ఏమో తెలియదు. అయినా నీకు తెలుసు, ఇప్పుడు ఆమె చూపుల బాణాలకు నేను చిక్కను. నాకు స్త్రీలపట్ల ఉన్న వ్యామోహం తగ్గిపోయింది. తొలినాళ్ళలో మన్మథుడు పూలబాణాలు వేసేవాడు. నాలో మంటలు పుట్టేవి. ఇప్పుడా మంటలు చల్లారి పోయాయి. విరక్తి కలిగింది. కానీ ఈమె మాత్రం ఇంకా నన్ను చూస్తూనే ఉంది. బహుశా నావైరాగ్యం సడలిపోతుందన్న ఆశ కాబోలు, ఎంత పిచ్చిది" అని స్నేహితునితో చెప్పాడు.

స్త్రీ, పురుషులకు ఎప్పుడు ఏకాంతం దొరుకునా? అని మన్మథుడు ఎదురు చూస్తుంటాడు. యవ్వనంలో ఉన్న స్త్రీ, పురుషులు ఎదురెదురు పడగానే మన్మథుడు తన పరివారంతో పాటూ వచ్చేస్తాడు. వ్రేళ్ళు నొప్పి పుట్టేటట్లు వింటివారిని లాగి పూలబాణాలను వేస్తాడు. కోకిల మంచిపాటలు పాడుతుంది. అప్పుడు స్త్రీలు తమ చంచలమైన కడగంటి చూపులను ప్రసరింపచేస్తారు. పండితుడు సరిగ్గా ఇప్పుడు అలాంటి పరిస్థితిలో ఉన్నాడు.

కాని, ఇప్పుడతడు విరాగి. మన్మథున్ని బూడిద చేసిన శివుని ధ్యానించడం వల్ల కలిగిన వైరాగ్యమది. శంకరునికి కింకరుడైన వాడు, మన్మథునికి ఎలా బానిస అవుతాడు? అమృతాన్ని త్రాగేవానికి పులిసిన అంబలి రుచిస్తుందా? బ్రహ్మానందం పొందినవాడు, విషయానందాన్ని కోరుకొంటాడా?

అందుకే పండితుడన్నాడు "ఓ మన్మథా? నీవు నీ పరివారంతో సహా వెనక్కి వెళ్ళు! అమ్మా! వృథా ప్రయాస ఎందుకు? వెళ్ళిపో!"

ఆ సన్నివేశాన్ని చూసిన పండితుని స్నేహితుడు 'మీరిద్దరూ ఒకచోట ఉన్నారని, పరస్పరం ఆసక్తితో ఉన్నారనుకొన్నాను. కాని, అది తప్పు. స్త్రీ పురుషు లిద్దరు ఒకచోట ఉన్నంత మాత్రాన వారు ఆసక్తులైనట్లు కాదు. ఆసక్తికి, విరక్తికి మనస్సే కారణం. మనసులు కలిస్తే మనుషులు దూరంగా ఉన్నా ఆసక్తి ఉన్నట్లే. మనసులు కలువకపోతే కలిసే ఉన్నా వారు విరక్తులైనట్లే' అనుకొన్నాడు.

ఆ స్నేహితుడు పండితునితో "మిత్రమా! ఒకసారి ఆకాశంవైపు చూడు, మబ్బులు దట్టంగా కమ్ముకొంటున్నాయి. ఇంటికి బయలుదేరు" అన్నాడు. వర్షం కురుస్తున్నప్పుడు స్త్రీ పురుషుల్లో కోరికలు పెరుగుతాయి. సంగమవాంఛ కలుగుతుంది. భార్యలను వదలి భర్తలు, భర్తలను వదలి భార్యలు బ్రతకడం కష్టం. ప్రకృతికున్న శక్తి అటువంటిది. సంగమం కూడా ప్రకృతి స్వరూపమే. అందుకే సంగమ వాంఛ బలమైనది. కుటుంబాలను ఆస్తులను, పిల్లలను విడిచిపెట్టి సంగమం కోసం స్త్రీ పురుషులు వెళ్ళిపోతారు. కొందరు రహస్యంగా వెళ్తే, మరికొందరు బహిరంగంగానే వెళ్ళిపోతారు.

వర్షం రావడం మనసులో ఉంచుకొని తనస్నేహితుడు చెప్పిన మాటలకు పండితుడు 'నా ప్రియురాలు ప్రాణంతో ఉన్నా, చనిపోయినా ఒకటే. నేను ఇంట్లో ఉన్నా, ఇక్కడే ఉన్నా ఒకటే. నాకు విరక్తి కలిగింది. ఇక నేను ఇంటికి రాను" అన్నాడు.

పండితుడు తాను తెలుసుకొన్న సత్యాన్ని తన మిత్రునికి చెబుతున్నాడు. 'మిత్రమా! స్త్రీ సంగమం సుఖాన్నిస్తుంది. కాని అది క్షణికం. ఆ తాత్కాలిక సుఖం కోసం మనసు వెంపర్లాడటం దేనికి? దుఃఖితుల పట్ల కరుణతో ఉండటం, పుణ్యాత్ములతో మైత్రి, తార్కిక బుద్ధిని పెంపొందించే ప్రజ్ఞ మనసుకు అలవాటు చేయాలి. ఇవి ఇహంలోను, పరంలోను మనిషిని కాపాడుతాయి.

ముత్యాలహారాలతో, మెరిసే స్త్రీల పాలిండ్లుగాని, చిరుగజ్జెల ఒడ్డాణముతో అలంకరించబడిన స్త్రీల నితంబాలుగాని నరకం నుండి రక్షించవు. అవి స్వర్గాన్నిస్తాయనుకోవడం కేవలం భ్రమ, కాని మనసు భయంకరమైనది. అది స్త్రీలతో ముచ్చట్లు చెప్పాలంటుంది. వారి క్రింది పెదవిలో నిలువఉన్న తేనెను జుర్రుకోమంటుంది. చంద్రబింబం వంటి ముఖాన్ని ముద్దాడమంటుంది.

కుండల్లాంటి కుచాల్ని కౌగిట్లో యిరికించుకోమంటుంది. సురతక్రీడలో అలసిన స్త్రీల నిట్టూర్పుల కమ్మని వాసనలు ఆఘ్రాణించమంటుంది. మనసు మాట విన్నవాడు స్త్రీల మాయలో మునిగిపోతాడు.

అందుకే మనస్సును ఊరికే ఉంచరాదు. దానిని నిరంతరం యోగాభ్యాసం నందు నిలపాలి. ఆత్మ స్వరూపాన్ని గూర్చిన చింతన దానికి అలవాటు చేయాలి. యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం, ధారణ, సమాధి యనెడి అష్టాంగ యోగాల ద్వారా ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించుకోవాలి. అలా నిలిపి ఆత్మానందాన్ని అనుభవించాలి. ఇదంతా చేయగల్గిన శక్తి మనసుకు ఉంది. అంత శక్తివంతమైన మనసును విజ్ఞానం కోసం కాకుండా కేవలం ఒక స్త్రీ శరీరపు అందాల్ని స్మరించుకోవడం కోసం వాడుకోవడం ఎంత తెలివి తక్కువ పని? యోగం అలవడిన వాడు యోగి. యోగికి స్త్రీ సంగమం నీచంగా కనిపిస్తుంది.

మిత్రమా! కామెర్ల రోగికి లోకం పచ్చగా కనిపిస్తుంది. వాస్తవానికి లోకం పచ్చగా ఉంటుందా? రోగం పోగానే నిజస్వరూపం తెలుస్తుంది కదా! అట్లాగే అజ్ఞానికి స్త్రీయే ప్రపంచంగా కనిపిస్తుంది. ఆమె పొందు స్వర్గం, ఆమె వియోగం నరకం అనుకొంటాడు. వివేకం కలిగిన జ్ఞానికి ప్రపంచం పరబ్రహ్మ స్వరూపంగా కనిపిస్తుంది. ఇప్పుడు నా పరిస్థితి కూడా అంతే" అన్నాడు పండితుడు.

అప్పుడు పండితుని స్నేహితుడు 'మిత్రమా! వైరాగ్యం కలిగిన వారంతా నీలా ఉండరు. ఎందుకంటే వారిలో విషయవాసనలు నశించవు. అయాచితంగా మఠాధిపత్యమో, సన్న్యాసమో మీద పడుతుంది. లోకం కోసం నటిస్తారు. ప్రజలను పిచ్చివాళ్ళను చేసి నమ్మిస్తారు. నాకు తెలిసిన ఒక మఠాధిపతి ఉన్నాడు. అతడు నీలా సువిరక్తుడు కాడు, కానీ బాగా చదువుకొన్నవాడే, పండితుడే. అతడు వేదిక మీద కూర్చొని చెప్పే ఉపన్యాసాలు చాలా విన్నాను. స్త్రీలు నరకద్వారాలన్నాడు. స్త్రీ వ్యామోహం చెడ్డదన్నాడు. వారితో చేరరాదన్నాడు. స్త్రీ సాంగత్యం కంటే వనవాసం మేలన్నాడు. నేను ఆ మాటలు విని చాలా సంతోషించాను.

ఒక పర్యాయం మఠానికి వెళ్ళాను. అతని గది ద్వారం దగ్గర ఉండే కాపలాదారు లేడు. సరాసరి గదిలోపలికి వెళ్ళిపోయాను. అవాక్కయ్యాను.

ఆడుజింక చూపులవంటి స్త్రీల చూపులు ఎంతవరకు ప్రసరించవో అంతవరకే వివేకం. ఆపై పండితుని వివేకదీపం ఆరిపోతుంది. బుద్ధి చెడుతుంది. విజ్ఞత నశిస్తుంది. కెంపులు పొదిగిన వడ్డాణం ధరించిన స్త్రీ కటిభాగాన్ని ఎవడు పరిత్యజించ గలడు. మాటలతో విరక్తిని బోధించడం సులభమే. ఆచరణ చాలా కష్టం.

అతణ్ణి ఎందుకిలా చేస్తున్నావని సూటిగా అడిగాను. అతడేమన్నాడో తెలుసా? 'సంసారాన్ని వదిలేస్తాం, వైరాగ్యంతో అరణ్యానికి వెళ్తాం. తపస్సు చేస్తాం. ఆ తపస్సుకు ఫలం – స్వర్గం, స్వర్గమంటే అప్సరసలు, అమృతం. అక్కడ కూడా స్త్రీ సంభోగమే. అన్ని తపస్సులకు, యజ్ఞాలకు, యాగాలకు, క్రతువులకు ఫలితం అప్సరసలతో రమించడమే. అప్సరసలవంటి స్త్రీలు ఇక్కడే ఉండగా తపస్సు వృథా ప్రయాస గదా!' అన్నాడు.

అతని పాండిత్యం ఎంత బాగా ఉపయోగపడిందో చూశావా మిత్రమా! ఇటువంటి వారు తాము మోసపోయి, ఇతరుల్ని మోసం చేస్తుంటారు. ఇటువంటి బూటకపు పండితులు దుర్విరక్తులు.

మదపుటేనుగు చాలా బలమైంది. దాని కుంభస్థలాన్ని చీల్చగలవారు లోకంలో ఉన్నారు. మరికొందరు సింహాన్ని కూడా చంపగల సమర్థులు. కాని మన్మథుని గర్వాన్ని అణచేవారెవరు? ఎవరూలేరని నేను చెప్పగలను. సరే మఠాధి పతుల్ని వదిలేద్దాం.

మా ఊళ్ళో ఒక కుర్రవాడుండేవాడు. బాగా చదువుకున్నాడు. పెద్దలంటే గౌరవం. ఎవరికీ హాని చేసేవాడు కాదు. ఎవర్నీ దూషించేవాడు కాదు. ఏ చెడ్డ పని చేసేవాడు కాదు. అతన్ని అందరూ పొగిడేవారు. ఆ పొగడ్తలు ఒక జార స్త్రీ చెవిన పడ్డాయి. ఆమె మనసు అతనిపై పడింది. స్త్రీలు ఎటువంటి పనినైనా చేయగలరు. వారిని అడ్డుకోవడం బ్రహ్మకు కూడా చేతకాదు. వారి ప్రేమావేశం అటువంటిది.

ఆమె మంచి అందగత్తె. ఆమె కళ్ళు చెవుల వరకు ఉంటాయి. ఆమెనల్లని కనురెప్పలు ములుకుల్లా ఉంటాయి. ఆమె కళ్ళలోకి చూస్తే ఎటువంటి పురుషుడైనా ధైర్యాన్ని కోల్పోవలసిందే. ఒకరోజు ఆమె అతణ్ణి చూసింది అంతే. ఒక క్రూరమైన

మదనాగ్ని అతనిలో ప్రవేశించింది. అతని పాండిత్యం మంట గలిసింది. అతని గొప్పతనం బూడిదైంది. కులం, వివేకం మాయమయ్యాయి.

ఎంత పండితుడైతే ఏంలాభం? ఎంతటి నీతిమంతుడైతే ఏం లాభం? ఎంత తత్త్వం తెలిసిన వాడైతే ఏం లాభం? ఆమె చూపుల్లో చిక్కుకొన్నాడు. ఆ చూపులు అతనికి వశీకృత మంత్రాలయ్యాయి. ఆమె తెరచినది కనురెప్పలనుకొన్నాడు. పాపం, అవి నరకద్వారాలని తెలియదు. ఇంకెక్కడి సద్గతి?

మిత్రమా! అటు వీధిలోనికి చూడు. ఆ కుక్కను చూడు. అది కూడులేక చిక్కిపోయి ఉంది. ఎవరో రాయి విసరితే కుంటిదైంది. తిండికోసం జరిగిన కొట్లాటలో కన్నులొట్టబోయింది. చెవులు తెగిపోయాయి. తోక విరిగిపోయింది. శరీరమంతా గజ్జిపుండ్లు, వాటి నుండి చీము, నెత్తురు. దానికి ముసురుతున్న ఈగలు. పుండ్లలోనుంచి రాలిపడుతున్న పురుగులు. ఓటి కుండలో మెతుకుల కోసం తలను దూర్చినట్లుంది. కుండ పెంకు మెడకు చిక్కుకొని ఇటురాక అటుపోక అల్లాడుతూ ఉంది. అయినా చూడు ఆడకుక్క కనిపించగానే దానిని కలవడం కోసం వెంబడించి వెళ్తూ ఉంది. ముసలి కుక్కను కూడా మదనుడు వదల్లేదు.

పండితుడు మొదలు ముసలికుక్క వరకు అందరికీ ఈ మన్మథుడు మోహాన్ని కలుగజేస్తూనే ఉంటాడు". పండితుడు శ్రద్ధగా వింటున్నాడు అతని మిత్రుడు దుర్విరక్తులను గూర్చి మరలా ఇలా అన్నాడు.

మిత్రమా! నీ వైరాగ్యం నాకు నచ్చింది. నువ్వు ఇలాగే దృఢ చిత్తుడవై ఉండు! నేను ఒక రసికునితో వైరాగ్యాన్ని గురించి ప్రస్తావించాను. అతడు నన్నొక అమాయకునిగా నిందించి ఇలా అన్నాడు.

"పిచ్చివాడా! మన్మథుడే సమస్తము. లోకమంతా అతని ఆజ్ఞకు లోబడి ఉండాలి. స్త్రీలు అతని విజయ ముద్రికలు. అతని ఆజ్ఞను మీరిన వారిని అతడు శపిస్తాడు. అతని శాపానికి గురైనవారు కొందరు దిసమొలతో ఉంటారు. కొందరు బోడిగుండుతో ఉంటారు. కొందరికి కొంచెం జుట్టుపెట్టి గొరిగిస్తారు. కొందరు తైల సంస్కారంలేని జడలతో ఉంటారు. కొందరు తలపుర్రెతో అడుక్కు తింటుంటారు. ఈ విషయం తెలియని వారు ఆశాపగ్రస్తులను దిగంబరులని, పరమహంసలని, సన్న్యాసులని, మునులని, కాపాలికులని కీర్తిస్తూ ఉంటారు.

విశ్వామిత్రుడు, పరాశరుడు సంసారం దోషమనుకొన్నారు వదిలి వేశారు. అరణ్యానికి వెళ్ళారు. ఆకులలములు తిన్నారు. సెలయేటి నీటితో జీవనం సాగించారు. ఎంతవరకు? విశ్వామిత్రునికి మేనక కనిపించనంతవరకు, పరాశరునికి మత్స్యగంధి కనిపించనంతవరకు అటుపై వారి తపస్సేమయ్యింది. వారి ఇంద్రియ నిగ్రహం ఎక్కడికెళ్ళింది. శకుంతల ఎలాపుట్టింది? వేదవ్యాసుడెలా జన్మించాడు?

అరణ్యాల్లో ఆకులలములు తినే మహర్షుల కథలివి! వరి అన్నంలో పాలు, పెరుగు, నెయ్యి కలుపుకొని తినే సామాన్య మానవులకు వైరాగ్యం కలుగుతుందా? ఇంద్రియ నిగ్రహం ఉంటుందా? ఒకవేళ ఉంది అంటే వింధ్యపర్వతం సముద్రంలో తేలుతుంది."

నాకేం మాట్లాడాలో తెలియలేదు మిత్రమా! కామినులు నీవెంట బడినా నీ నిగ్రహం చలించలేదంటే నీవు సువిరక్తుడివి. స్త్రీ వ్యామోహాన్ని మనసులో దాచుకొని పైకి నీతులు వల్లించేవారు, శాస్త్రాలను తమకు అనుకూలంగా మలచుకొని తమ కాముక చర్యలను సమర్థించుకొనేవారు దుర్విరక్తులు. నీ వైరాగ్యం ఫలిస్తుంది అని అతడు పండితుని దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

ఇది విరక్త పద్ధతి. విరాగిని ఋతువులు కూడా హింసిస్తాయి. ఒక్కో ఋతువు మారేకొద్ది మనసులో కామవికారాలు పుట్టుకొస్తాయి. వాటిని కూడా విరాగి అధిగమించాల్సిందే.

## ఋతువర్ణన పద్ధతి

ప్రకృతిలో మనిషి అంతర్భాగం. మానవుని జీవితం, ఆహారం, ఆలోచనలు, నాగరికత, ఆనందాలు అన్నీ ప్రకృతితో ముడిపడి ఉంటాయి. సూర్యోదయం, అస్తమయం, చంద్రుడు, నక్షత్రాలు, భూమి, ఆకాశం, మబ్బులు, వాన, మొలకెత్తే విత్తనాలు, చెట్లు, పువ్వులు, నదులు, పర్వతాలు మొదలైనవన్నీ మనిషిచుట్టూ ఉంటాయి. మనిషి వీటి మధ్యలో వీటన్నిటితో మమేకమై ఉంటాడు.

మానవుని జీవితం మారుతూ ఉంటుంది. ప్రకృతి కూడా. ప్రకృతి మానవునిపై ప్రభావాన్ని చూపుతుంది, మనసుపై కూడా. ప్రకృతిని ఎదిరించడం అసాధ్యం. ప్రకృతితో స్నేహంగా ఉండటం ఆరోగ్యకరం. మారే ఋతువులు మానవుని ప్రవృత్తిలో మార్పును కలుగజేస్తాయి. శారీరకంగా, మానసికంగా కొన్ని ఋతువులు

ఉల్లాసాన్నిస్తాయి, కొన్ని ఉత్సాహాన్నిస్తాయి. కొన్ని, కొన్నిరకాల బాధలకు గురిచేస్తాయి. కొందరు సుఖంగా ఉంటారు. కొందరు దుఃఖిస్తారు. రెండు నెలలే, మళ్ళీ ఋతువు మారిపోతుంది. సంతోషమైనా, దుఃఖమైనా శాశ్వతం కాదు.

వసంతఋతువు వస్తుంది. గాలులన్నీ పూల పరిమళాలను వెదజల్లుతూ ఉంటాయి. కొమ్మల కొనల్లో లేత చిగుళ్ళు పుడుతూ ఉంటాయి. చంద్రబింబం వంటి ముఖాలున్న అందగత్తెలు సంభోగంలో పాల్గొన్నప్పుడు వారి ముఖాలమీద చెమట పుడుతుంది. ఆ చెమట పురుషులను మరింత ఉత్సాహ పరుస్తూ ఉంటుంది.

కోకిలలు అవ్యక్త మధురమైన కూతలు కూస్తుంటాయి. మలయమారుతం వీస్తూ ఉంటుంది. దంపతులకు ఇది ఆనందదాయకం. భర్త చెంతలేని భార్యలు, భార్యలు దగ్గరలేని భర్తలు – ఈ ఋతువులో విరహంతో బాధపడుతుంటారు. అన్ని జీవులు ఆనందించే ఈ వసంతంలో విరహిణులు మాత్రం నరకాన్నే చవి చూస్తారు. చెడుకాలం వచ్చినప్పుడు అమృతం కూడా విషమే కదా!

పుణ్యం చేసుకొన్నవారు ఈ వసంతంలో స్త్రీలతో రతి సౌఖ్యాన్ని అనుభవిస్తారు. ఆడుకోయిలల పాటలు వింటారు. చక్కగా పూచిన పొదరిండ్లలో విహరిస్తారు. కవులతో, కవిత్వంలో ముచ్చటించుకొంటారు. వెన్నెల్లో పడుకొని నిద్రపోతారు.

వసంతంలో భర్తలు చెంతలేని భార్యల హృదయం యజ్ఞగుండంలా మండుతూ ఉంటుంది. వారి శరీరం నుంచి వేడిగాలులు పుడుతూ ఉంటాయి. మామిడి పూల గుత్తులను చూచిన ఆడుకోయిలలు కూడా విరహంతో వేగిపోతుంటాయి. పాటలీ పుష్పాల వాసనతో భారంగా వీచేగాలి, దంపతుల రతిశ్రమను పోగొడుతూ ఉంటుంది.

ఇంత విరహాగ్నిలో వేగిపోయిన స్త్రీలు తమభర్తలు ఉత్సాహంగా ఇంటికి రావడం చూస్తారు. వారిముఖంలో ఎక్కడైనా వియోగదుఃఖం కనిపిస్తుందేమోనని వెతుకుతారు. కనిపించదు, కారణం, వారు తమ భార్యలను కలుసుకొంటున్నామనే ఆనందంలో ఉన్నారు కనుక. ఆడవారి మనసులో అనుమానం బయలుదేరుతుంది. తనకుదూరంగా ఉన్నరోజుల్లో వేరొక స్త్రీతో ఉన్నాడేమో అందుకే ఆనందంగా ఉన్నాడను కొంటుంది. అలుగుతుంది. పెడమొహం పెడుతుంది. మాట్లాడదు,

కోపగించుకొంటుంది. దూరంగా ఉంటుంది. సరిగ్గా అప్పుడు చందనపు చెట్ల నుంచి చల్లని గాలి వీస్తుంది. ఆమె కోపంగానే ఉంటుంది, కోరికగా ఉంటుంది. దగ్గరికెళ్తుంది. ఏదో మాట్లాడాలనుకొంటుంది. అతన్ని నిందించాలను కొంటుంది. మనసులో 'అడిగేస్తాను, దుమ్ము దులిపేస్తాను' అనుకొంటుంది. ఆమెకు తెలియ కుండానే అతన్ని కసిగా వాటేసుకొంటుంది. అది వసంత ఋతువు గొప్పదనం.

ఈ ఋతువులో మామిడి పువ్వులలోని పుప్పొడి గాలినిండా కమ్ముకొని ఉంటుంది. తుమ్మెదలకు పూదేనె కావలసినంత దొరుకుతుంది. ఈవాతావరణం స్త్రీ, పురుషులందరికి సంభోగం మీద కోరికను కలిగిస్తుంది. మోడువారిన మనస్సుల్లో కూడా ప్రేమ చిగుర్లు తొడుగుతుంది.

ఇక గ్రీష్మ ఋతువు వంతు. విపరీతమైన ఎండలు, సంభోగం పట్ల ఆసక్తి ఉన్నా ప్రకృతి కనికరించదు. కాని, పుణ్యాత్ములకు మల్లెలు మొదలగు కమ్మని సువాసన గలిగిన పూలదండలు అందుబాటులో ఉంటాయి. వట్టివేర్ల విసనకఱ్ఱల గాలి, చంద్రుని కిరణాలు, మంచి గంధపు పూత, క్రీడాసరస్సులు, పలుచని బట్టలు, తెల్లని మేడల పైభాగములు, స్వచ్ఛమైన మధుపానీయం, తామర రేకుల వంటి కన్నులు గల స్త్రీలతో సంభోగం వేసవితాపాన్ని పోగొడతాయి. ఇవన్నీ అందుబాటులో ఉన్నవారు అదృష్టవంతులు.

సున్నపు పూత పూసిన ఇల్లు వేసవిలో చల్లదనాన్నిస్తుంది. వెన్నెల తెల్లదనం, చల్లదనం మనసును ఉల్లాసపరుస్తాయి. మంచి గంధపు పూత సౌరభాన్ని, చల్లదనాన్ని ఇస్తుంది. అదేవిధంగా పూలదండలు. ఇవన్నీ సంసారం పట్ల ఆసక్తి ఉన్నవారికి ఆకర్షణీయంగా ఉంటాయి. విరాగులు వీటిని లక్ష్యపెట్టరు. ఇవి దొరకడం వల్ల కలిగే సంతోషానికి, ఇవి లేకపోవడం వల్ల కలిగే తీయని బాధకు విరాగులు అతీతులు.

ఆడు జింక కన్నుల వంటి చపలనేత్రాలు కలిగిన స్త్రీలు మిక్కిలి సుకుమారులు. వారు వేసవి తాపాన్ని భరించలేరు. అందుకే వారు వారి ఒళ్లంతా మంచిగంధపు పూత పూసుకొంటుంటారు. నీటిధారలు జిమ్మే జలయంత్రాల క్రింద జలకాలాడుతారు. వెన్నెల్లో, పిల్లగాలులు వీస్తున్నప్పుడు వెల్లవేసిన మేడలమీద జాజిపూల జడలతో విహరిస్తారు. వారు ఇవన్నీ వేడిని భరించలేక చేసిన

చేష్టలయినా, పురుషులకు మాత్రం ఇవి మదన తాపాన్ని కలిగిస్తాయి. పాపం మగవాళ్ళు! ఒకవైపు గ్రీష్మ తాపం మరోవైపు మన్మథ ప్రతాపం.

ఎలాగో గ్రీష్మాన్ని దాటగానే వర్షర్తువు వస్తుంది. వర్ష ఋతువు యవ్వన వతియైన స్త్రీవలే ఉంటుంది. కామాన్ని రగుల్చుతుంది. జాజిపూల వాసనతో, ఎత్తైన పయోధరాలతో (పయోధరం = మేఘం, చన్ను) ప్రతి వానికి సంభోగేచ్ఛ కలిగిస్తుంది.

వర్షాకాలపు ఆకాశం మేఘాలతో నిండిఉంటుంది. ఆ మేఘాలను చూసి నెమళ్ళు నాట్యం చేస్తుంటాయి. అడవి మల్లెల వాసన పీల్చిన గాలి మత్తుగా వీస్తుంటుంది. ఉద్యాన వనాలన్నీ ఉల్లాసంగా కనిపిస్తాయి. మబ్బుల ఉరుములకు పొలాలలో పుట్టగొడుగులు మొలుస్తాయి. ఈ దృశ్యాలన్నీ భాగ్యవంతులకు, పేదవారికి సమానంగా ఉంటాయి. అందరికి ఆహ్లాదాన్ని పంచుతాయి.

ఈ దృశ్యాలన్నీ ప్రియురాళ్ళకు దూరంగా ఉన్న ప్రియుల మనసుల్లో విరహాగ్నిని రగుల్చుతాయి. వారు తమ ప్రేయసి ఉన్నచోటుకు వెళ్ళాలను కొంటారు. నేలచూస్తూ నడవాలంటే ఎక్కడ చూసినా పుట్టగొడుగులే. 'ఇప్పుడో, ఇంకాసేపట్లోనో వర్షం వస్తుంది' అన్నట్టుంటాయి. పైకి చూస్తూ వెళ్దామంటే దట్టమైన మబ్బులు–ప్రక్కలకు చూస్తూ వెళ్దామంటే ఎటుచూసినా పురులు విప్పి ఆడే నెమళ్ళు. ఇవన్నీ వాన రాకడతో భయపెడుతూ ఉంటాయి. మనసు మాత్రం ప్రేయసికోసం తహతహ లాడుతూ ఉంటుంది. వెళ్ళలేదు, ఉండలేదు.

ప్రియుడు చెంతలేని స్త్రీలను కూడా ఈ వర్షాకాలపు మెరుపుతీగెలు, మొగిలి పూలవాసనలు, నెమళ్ళ కలకూజితాలు బాధ పెడుతుంటాయి. రహస్యంగా ఒక సంకేత స్థలానికి వెళ్ళి ప్రియుని కలుసుకోవాలనుకునే స్త్రీలకు ఈ సంభోగేచ్ఛ విపరీతమైన తెగువను ప్రసాదిస్తుంది. వర్షం వారిని రెచ్చగొడుతుంది. చీకటి వారికి సహకరిస్తుంది. మెరుపు వారికి దారిచూపుతుంది. ఉరుములు వారి నిట్టూర్పులను తమలో కలుపుకొంటాయి. ఈవిధంగా వర్షం స్త్రీలకు సంతోషాన్ని, వ్యసనాన్ని కలిగిస్తూ ఉంటుంది.

వర్షఋతువులో జడివాన కురుస్తూ ఉంటుంది. ఇంటిపట్టున ఉన్న ప్రియులు తమ ప్రియురాళ్ళ కౌగిళ్ళలో బందీలైపోతారు. వర్షపు తుంపురులతో కూడిన

ఈదురు గాలులు వారిని చాలా చాలా దగ్గరకు నెడుతూ ఉంటాయి. మేఘాలు కమ్ముకొన్న దినాన్ని దుర్దినం అంటారు. నిజానికి మేఘాలు కమ్ముకొని, ఈదురు గాలులు వీస్తూ, సూర్యరశ్మి సోకని దుర్దినాలు ప్రేయసీ సంగమం వల్ల సుదినాలుగా మారిపోతాయి.

శరత్కాలంలో దంపతులు ఏకాంతంగా మేడమీదికి చేరుకోవాలి. అర్ధరాత్రి వరకూ కాలక్షేపం చేయాలి. చంద్రుడు నడిమింటికి వస్తాడు. వెన్నెల ధార కురుస్తూ ఉంటుంది. అప్పుడు రతి ప్రారంభించాలి. పురుషుడు, తన స్త్రీ క్రింది పెదవిలో దాగిన మద్యాన్ని తనివితీరా ఆస్వాదించాలి. భర్త అలసటను గమనించిన భార్య అతనిని కౌగిలించుకొని తానే రతి చేయాలి. అప్పటికి పూర్తిగా అలసిపోయిన పురుషునికి వీర్యవృద్ధిని కలిగించే హంసజలాన్ని స్త్రీ తెచ్చి ఇవ్వాలి. హంస జలమంటే పగలంతా సూర్యకిరణాలకు కాగి, రాత్రి చంద్రకిరణాలకు చల్లబడుతూ రాత్రింబవళ్ళు ఉండే నీరు. ఇది రతిశ్రమను పోగొడుతుంది. శీతలత్వాన్నిస్తుంది. ముఖానికి కాంతినిస్తుంది. సంభోగసామర్థ్యాన్ని పెంచుతుంది. ఈ విధంగా శరదృతువు గడపని పురుషుడు దురదృష్టవంతుడు.

హేమంత ఋతువులో చలి అధికంగా ఉంటుంది. పాలు, నేయి, పెరుగుతో కూడిన భోజనం, కావిరంగు బట్టలు, కుంకుమపూవు కలిపిన గంధపుపూత, తాంబూళం ఈ ఋతువులో సుఖాన్నిస్తాయి. వీటితోపాటు ఎత్తైన చన్నులు కలిగి, దృఢమైన తొడలుగల యవ్వనవతుల బిగికౌగిళ్ళలో గాలి దూరని గదుల్లో సుఖించేవారు అదృష్టవంతులు.

చలికాలంలో రాత్రులు దీర్ఘంగా ఉంటాయి. అరవిరసిన కుందనపు పూల మకరందాన్ని త్రాగుతూ తుమ్మెదలు మత్తుగా ఉంటాయి. ప్రేంకణపు పూలు దట్టంగా పూచి ఉంటాయి. దండలు దండలుగా విచ్చిన మందారపు పూలు మంచుగాలికి కదులుతూ ఉంటాయి. అలాంటి సమయంలో ప్రియురాలి కౌగిట్లో లేని పురుషుడు అనుభవించే యాతననే 'నరకం' అంటారు.

ఇక చివరిదైన శిశిర ఋతువు చాలా అల్లరిది. ఈ ఋతువులో నులివెచ్చని గాలులు వీస్తాయి. అవి యవ్వనాంగుల చెక్కిళ్లను ముద్దాడుతాయి. వారు కసురు కొంటారు. అయినా విడిచిపెట్టవు. వారి ముంగురులను కదిలించి అల్లరి చేస్తాయి.

వారు బిగువైన రవికెలను తొడుకొని ఉన్నా, ఈ గాలులు ఎలాగో లోనికి ప్రవేశిస్తాయి. వారికి గగుర్పాటును కలిగిస్తాయి. వారి తొడలను కదిలిస్తాయి. వారి విస్తారమైన కటిభాగాన్ని కప్పిన చీరను ఎగురగొడుతూ, రతికి అంగీకరించని ముగ్ధను లాలించే విటునివంటి చేష్టలతో గాలులు అల్లరి చేస్తూ ఉంటాయి. వారిలో మెల్లమెల్లగా కోరికలను రాజేస్తూ ఉంటాయి.

తల నిమరటం, కన్నులు మూయడం, చెక్కిలి తడమటం, బట్టలు లాగడం, మెలమెల్లగా శరీరభాగాలను తాకడం, పెదాలను మునిపంటితో నొక్కడం మొదలగు చేష్టలు సంభోగ శృంగారానికి ముందు పురుషుడు చేయదగిన పనులు. ఇవన్నీ చేస్తున్న శిశిరపు వెచ్చని గాలిని చూస్తుంటే వాయుదేవుడు కూడా పరస్త్రీలతో సరసమాడుతున్నట్లు కనిపిస్తుంది. గాలి మైథునానికి కావలసిన ఏర్పాట్లను చేసిన పిమ్మట ఎవరు నిగ్రహంగా ఉండగలరు?

ఈ విధంగా అన్ని ఋతువులు శృంగారానికి అనుకూలిస్తాయి. అనుకూలించ నప్పుడు చేసుకోవాల్సిన ఏర్పాట్లను కూడా 'భర్తృహరి' తన శృంగార శతకంలో తెలియజేశారు. దంపతులందరూ ఈ రతి రహస్యాలను తెలుసుకొని శృంగార రసాన్ని ఆస్వాదించెదరు గాక!

దీనితో భర్తృహరి వ్రాసిన మూడు శతకాల్లో రెండవదైన శృంగార శతకం ముగిసింది.



# వైరాగ్య శతకము

శృంగారంలో ఓలలాడించి, నీతిశాస్త్రరహస్యాలను తెలియజేసిన భర్తృహరి, ఇప్పుడు వైరాగ్యాన్ని ప్రతిపాదిస్తున్నాడు. రాగద్వేషాలు దుఃఖహేతువులు. వైరాగ్యం ఆనందాన్నిస్తుంది. వస్తు, విషయమయ ప్రపంచం మనిషిని కుదురుగా ఉండనీయదు. పరుగులు తీయిస్తుంది. అలసిపోయాక, తాను పరుగెత్తింది ఎండమావుల వెంట అని తెలుసుకొంటాడు. అప్పటికే వయసు మీరిపోయి ఉంటుంది. ఏడుస్తూ మొదలైన జీవితం, ఏడుస్తూ, ఏడ్పిస్తూ ముగిసిపోతుంది. దీనికి పరిష్కారమే వైరాగ్యం. వైరాగ్యానికి ప్రతీక శివుడు. అతణ్ణి భర్తృహరి ఇలా ప్రార్థిస్తున్నాడు.

శివుడు దీపం. అతడు ప్రసాదించే జ్ఞానం వెలుతురు. జ్ఞానాన్ని మ్రింగి వేయాలనుకొనే మిడుత కామం. అదే మన్మథుడు. శివుని సిగలోని చంద్రుడు జ్వాల. జ్ఞానాన్ని ధరించే శుభావస్థ వత్తి. యోగుల మనస్సులు ఇండ్లు. వారి మనసుల్లో నిరంతరం శివుడు వెలుగుతూ ఉంటాడు. ఆశివుడే విరాగికి ఆదర్శం.

వైరాగ్యం రావాలంటే కోరికలు విడిచిపెట్టాలి. మానవుడు అనేక దేశాలు తిరుగుతాడు. కొండలెక్కుతాడు. నదులు దాటుతాడు. అభిమానాన్ని ఆచారాల్ని వదలివేస్తాడు. ధనికులకు దాస్యం చేస్తాడు. ఆశతీరదు. తృప్తి కలుగదు.

మానవుడు నిధులపై ఆశతో నేలను త్రవ్వుతాడు. బంగారం కొరకు కొండలను త్రవ్వి రాళ్ళను కరిగిస్తాడు. సముద్రప్రయాణం చేస్తాడు. తాను కష్టపడి రాజుల మనసులను సంతోషపెడతాడు. శ్మశానాల్లో కూర్చొని క్షుద్రశక్తులను ఆరాధిస్తూ అనేక రాత్రులు గడుపుతాడు. గ్రుడ్డిగవ్వను కూడా పొందడు. ఆశ తీరదు. తృప్తికలుగదు.

మానవుడు నీచులకు కూడా సేవచేస్తాడు. ఆ నీచుల తిట్లను వింటాడు. కన్నీటిని లోపల అణచిపెట్టుకొంటాడు. పైకి మాత్రం నవ్వుతాడు. ధనవంతులైన బుద్ధిహీనులకు కూడా నమస్కరిస్తాడు. ధనం రాదు. ఆశ తీరదు. తృప్తి కలుగదు. ఇంకేం ఆటలు మిగిలాయి? ఇంతకంటే నీచమైన పనులేం వున్నాయి? అయినా ఆశ మానవుని ఆడిస్తూనే ఉంటుంది.

ప్రాణం తామరాకు మీద నీటిబొట్టు వంటిది. ఏ క్షణంలో నయినా ఒలికిపోతుంది. అటువంటి ప్రాణంకోసం మానవుడు ధనగర్వంతో ఊగుతున్న వారి దగ్గరకు వెళ్తాడు. తాను చదువుకొన్నానని, పలానా పనిలో నేర్పరినని ఆత్మప్రశంస చేసుకొంటాడు. ఆత్మస్తుతి, పరనింద పాపాలేగదా! ధనం కోసం ఈ దోషాన్ని కూడా కూడగట్టుకొంటాడు. అయినా ఆశతీరదు. తృప్తి కలుగదు.

మునులు అవమానాలను సహిస్తారు. వారికి మనస్సుపై నిగ్రహం ఉంటుంది. దాన్నే సాధారణ మానవుడు ఎదిరించే శక్తిలేక సహిస్తాడు. మనిషి ధనవంతులకు సేవచేయుటకు, విదేశీ వ్యాపారాల కొరకు తన ఇంట్లో లభించే సుఖాలకు దూరంగా ఉంటాడు. మునులు వైరాగ్యంతో వాటికి దూరంగా ఉంటారు. మనిషి విధిలేక శీతోష్ణాలను భరిస్తాడు. ధనాన్ని సంపాదిస్తాడు. మునులు శీతోష్ణాలను భరించి తపోధనాన్ని సంపాదిస్తారు. మానవుడు ధనాన్ని ధ్యానిస్తాడు, ముని శివుణ్ణి ధ్యానిస్తాడు. వీటన్నిటి ఫలితంగా మానవుడు దుఃఖాన్ని పొందుతున్నాడు. మునులు ఆనందాన్ని పొందుతున్నారు.

మానవుడు భోగాలను అనుభవించడు. అవే అతణ్ణి అనుభవిస్తాయి. మానవులు తపస్సు చేయరు, పరితపిస్తూ ఉంటారు. కాలము పోదు. మానవుడే పోవాలి. ఆశ సడలదు. మానవుని శరీరమే పట్టు సడలిపోతుంది. ముఖం ముడుతలు పడుతుంది. తల తెల్లబడుతుంది. ఒక్కొక్క అవయవమే బిగి కోల్పోతుంది. ముసలితనం శరీరాన్ని ఆక్రమిస్తుంది. అప్పుడు కూడా మనిషికి ఆశతీరదు. తృప్తి కలుగదు.

మనిషికి అనుభవించాలనే కోరిక నశిస్తుంది. తాను పురుషుడనే అహంకారం పోతుంది. ప్రాణమివ్వడానికి వెనుకాడని మిత్రులు చనిపోతారు. ఊతకర్రలేనిదే నడువలేదు. కండ్లు కనిపించవు. చెవులు వినిపించవు, శరీరం నిండా రోగాలే.

ముసలితనం పీడిస్తూ ఉంటుంది. కాని, ఎక్కడ ప్రాణం పోతుందో అనే భయం వెంటాడుతూ ఉంటుంది. బ్రతకాలనే ఆశతీరదు. తృప్తి కలుగదు.

ఆశ ఒక దాటలేని నది. దిగులు దానికి ఇరువైపుల నున్న దరులు. ధైర్యం ప్రవాహవేగానికి నేలకొరిగి కొట్టుకుపోయే గట్టుమీద చెట్టు. అంతులేని కోరికలు నీరు. వ్యామోహం అలలు. అనురాగం మొసళ్లు. సందేహాలు నీటికోళ్ళు. అజ్ఞానం సుడిగుండాలు. మానవుడు ఈ నదిని ఈదలేక అవస్థపడుతున్నాడు. యోగులు ఈనదికి ఆవలిగట్టున ఆనందంగా ఉంటారు. వారు పరిశుద్ధహృదయంతో ఈ నదిని దాటివేశారు.

అని భర్తృహరి 'తృష్ణాదూషణమ'ను మొదటి దశకాన్ని ముగించి, 'విషయ త్యాగవిడంబనం' అను రెండవ దశకాన్ని ప్రారంభిస్తున్నాడు.

## విషయ పరిత్యాగ విడంబనము

సంసారంలోని సుఖం కూడా మేలనిపించదు. అవన్నీ పుణ్యాల మూలంగానే కలిగాయి. పుణ్యఫలం నశించగానే అప్పటివరకు ఉన్న భోగాలు పోతున్నాయి. మళ్ళీ దుఃఖమే కలుగుతున్నది. ఎంతకాలం ఉన్నా భోగాలు మానవుని వదలిపోతాయి. అలా పోయిన వాటిని గూర్చి దుఃఖించడం కంటే మానవుడు తనంతతాను వాటిని వదలివేయడం మంచిది. అందువల్ల మనశ్శాంతి కలుగుతుంది.

జ్ఞానులైన మానవులు మాత్రమే ఈపని చేయగలరు. సుఖాన్నిచ్చే ధనాన్ని కూడా జ్ఞానులు వదలిపెడతారు. అందుకే వారు ఆనందంగా ఉండగలుగు తారు. మనిషికి ముందు ధనం ఉండదు. ఇప్పుడు కూడా లేదు. ఇకపై వస్తుందో రాదో తెలియదు. కాని దానిపై కోరిక మాత్రం చావదు. ఆ కోరికే మనిషిని క్షణక్షణం హింసిస్తూ, హింస చేయిస్తూ ఉంటుంది.

కొండగుహల్లో విరాగులైన మునులు నివసిస్తూ ఉంటారు. భగవంతుని ధ్యానిస్తూ ఉంటారు. వారి కన్నుల నుండి ఆనందభాష్పాలు రాలుతుంటాయి. వాటిని పక్షులు గ్రోలుతుంటాయి. కాని సామాన్య మానవులకు మాత్రం కోరికలపై కోరికలు కలుగుతూ ఉంటాయి. మేడలు, బావులు, పూలతోటలు, అక్కడి విహారాలు మనసులో ఊహించుకొంటూ మనిషి ఆయుష్షును జారవిడుచు కొంటున్నాడు.

ఆశ మనిషిని అంత సులభంగా వదలదు. భిక్షాటన చేసి, ఒంటిపూట భోజనంతో, నేలపై పడుకొని, అతుకుల బొంతతో, తాను తప్ప తనవారెవ్వరూ లేని స్థితిలో ఉన్నవాని మనసుకూడా భోగాలను కోరుకొంటుంది.

కవులు స్త్రీల స్తనాలు మాంసపు ముద్దలై ఉండగా వాటిని బంగారు కుండలంటారు. కఫముతో నిండిన ముఖాన్ని చంద్రబింబమంటారు. మల, మూత్ర నిలయమైన కటిభాగాన్ని ఏనుగు కుంభస్థలమంటారు. ఏవగింపు కలిగే విషయాలను ఇలా వర్ణించి అనురక్తిని పెంచుతుంటారు. అనురక్తికైనా, విరక్తికైనా ఎన్నదగిన వ్యక్తి శివుడొక్కడే. ఆయన తన శరీరంలో అర్ధభాగాన్ని తనభార్యకిచ్చి అనురక్తిని, మన్మథున్ని దహించి విరక్తిని ప్రకటించాడు. మన్మథుని విషబాణాలకు లోబడి, స్త్రీలతో సంగమించే మానవులకిది అసాధ్యం.

దహిస్తుందని తెలియక మిడుత దీపశిఖపై పడుతుంది. చిక్కుకుంటామని తెలియక చేప గాలానికున్న ఎరను మ్రింగుతుంది. కాని మనిషి మాత్రం కష్టాలుంటాయని తెలిసే విషయాల పట్ల ఆసక్తిని కలిగిఉంటాడు. కోరికల గాలంలో ఇరుక్కుపోతుంటాడు. దప్పిక రోగానికి నీరు మందు, ఆకలి రోగానికి అన్నం మందు, మరుల రోగానికి జవరాలి కౌగిలి మందు. ఇవన్నీ ఓషధాలే కాని సుఖాలు కావు. పరిశీలించి చూడగా భోగాలు లేనే లేవు.

మేడ చాలా పెద్దది, కొడుకులు తనకు వశవర్తులు, సంపదలు మితిలేనివి, మనసెరిగి ప్రవర్తించే ఇల్లాలు. వయస్సు నిండుయవ్వనం. అజ్ఞానియైన వాడు ఇవన్నీ శాశ్వతమనుకొంటాడు. సంసారంలోనికి దిగుతాడు. చెఱసాలలో చిక్కుకొంటాడు. జ్ఞాని వీటి నిజస్వరూపం తెలుసుకొంటాడు. అవన్నీ క్షణభంగురాలని వదలివేస్తాడు. అన్ని అనర్థాలకు మూలం అజ్ఞానమే.

ఈవిధంగా విషయాసక్తి వల్ల మానవుడు పొందే దుఃఖాన్ని వివరించిన భర్తృహరి యాచనను నిరసిస్తున్నాడు.

## యాంచాదైన్య దూషణము

మనిషికి సుఖాలంటే మోజు. వాటికోసం ఏవేవో చేస్తాడు. ఆత్మాభిమానం వదులుకొంటాడు. అడుక్కుంటాడు. దానికి అనేక కారణాలు కల్పించుకొంటాడు.

చిన్నచిన్న వాటిని భూతద్దంలో చూస్తాడు, చూపిస్తాడు. తనను తాను సమర్థించు కొంటాడు. ఇంతటి నీచానికి కారణం వైరాగ్యం లేకపోవడమే. మానవంతుడు కూడా యాచనకు పూనుకొంటాడు. ఇంట్లో నూకలు లేవు. పిల్లలకు ఆకలి. వారు అమ్మదగ్గరికి వెళ్ళారు. ఆమె చిరిగిన చీరను పట్టిలాగుతూ 'అమ్మా! ఆకలి' అంటున్నారు. ఆ దృశ్యాన్ని చూసిన తండ్రి అభిమానవంతుడు, ఆత్మగౌరవం కలవాడు కూడా! అయినా భిక్షాటన చేస్తాడు. కేవలం తన పొట్టకూటికే అయితే యాచన చేసేవాడు కాదేమో! అంతదీనంగా 'భిక్షాందేహి' అనేవాడు కాదేమో!

కడుపొక బాన (పాత్ర). ఇది గౌరవాన్ని పోగొడుతుంది. వెన్నెలకు ముడుచుకు పోయే తామరపువ్వుల్లా సద్గుణాలను సంకోచింపచేస్తుంది. లజ్జ అనే తీగకు ఆకలి గొడ్డలి వంటిది. కడుపు తాత్కాలికంగా నిండుతుంది. మళ్ళీ ఆకలే. అందుకే యాచన.

ఇలా యాచన చేయవలసివచ్చినప్పుడు భిక్షాపాత్ర చేతబట్టి ఏగ్రామంలో అడుక్కున్నా బాధలేదు గాని, అభిమానవంతుడు బంధువులను యాచించకూడదు. ఇలాంటి నీచమైన ప్రవృత్తికంటే తపోభూములు మేలు. గంగా ప్రవాహం, విద్యా దరుల విహారం ఉన్న హిమాలయ పర్వతసానువుల్లో తపస్సు చేసుకోవడమే యాచన కన్నా మేలు.

లోయల్లో కందమూలాలు మాయమై పోలేదు. కొండల్లో సెలయేర్లు ఎండి పోలేదు. నారచీరలు, పండ్లు ఇచ్చే చెట్లు పాడుబడలేదు. నాలుగురాళ్ళు వెనక వేసుకొన్నందుకే ధనవంతుల మనుకొని విర్రవీగేవారిని, మర్యాద దప్పి నడుచుకొనే వారిని దేవిరించరాదు. దానికంటే కందమూలాలు తింటూ సెలయేటి నీరుత్రాగి, నారచీరలు ధరించడం మేలు.

పవిత్రమైన కందమూల ఫలాలు ఆహారంగా, లేత చిగురుటాకులు పరుపుగా తయారుచేసికొని భార్యతో సహా అరణ్యవాసం చేయుటమేలు. ఎందుకంటే అక్కడ ధనరోగంతో బాధపడే నీచుల పేరుకూడా వినిపించదు.

అరణ్యవాసం ఎంతబాగుంటుందో కదా! స్వేచ్ఛగా చెట్లనుండి పండ్లు కోసుకొన వచ్చు. ఎక్కడిబడితే అక్కడ చల్లని నీటితో ప్రవహించే నదులు. ఆనీరు తనివితీరా

త్రాగవచ్చు. లేత చిగురుటాకులతో పడకలు ఏర్పాటు చేసుకోవచ్చు. ప్రకృతి సిద్ధమైన ఇన్ని వసతులు ఉండగా ఇంకా ధనికులకు దాస్యం చేయడం ఎందుకు?

ధనికుల చెంతచేరి యాచించే వారిని చూసి, లౌకిక సుఖాలకై నీచమైన పనులు చేసేవారిని చూసి, కొండగుహలలో ధ్యానం చేసుకొనే సర్వసంగపరిత్యాగులు నవ్వుకొంటుంటారు.

ఆశ అంతంకాదు. వైరాగ్యమున్న వారు నిరంతరం ఆనందంగా ఉంటారు. ఆశ ఉన్నవారికి బంగారు కొండ లభించినా తృప్తి కలుగదు. బ్రహ్మ నిరర్థకంగా మేరువును అంటే బంగారు కొండను సృష్టించాడు. దానివల్ల ఎవరికీ ఆనందం కలుగదు. విరాగి కోరుకొనడు. ఆశ ఉన్నవాడి కోరిక తీరదు.

దైన్యం లేకుండా మాత్సర్యము లేకుండా భయాన్ని పోగొట్టి, దుఃఖాన్ని పోగొట్టి, నిరుపమాన సుఖాన్ని కలుగజేసేది భిక్షాటనం. దీనిని యోగులు శంభుసత్రమని, అక్షయనిధి అని అంటారు. అన్నివిషయాలు పరిత్యజించిన వారికి ఇదే జీవనోపాధి.

ధనికులను యాచించి అభిమానమును పోగొట్టుకొనుట కంటే అరణ్య నివాసము మేలని చెప్పిన భర్తృహరి, భోగాలు అస్థిరాలు అనే విషయాన్ని తెలియజేస్తున్నాడు.

## భోగాస్థైర్య వర్ణనము

భోగాలున్నవాడికి రోగాలభయం. గొప్ప కులంలో పుట్టిన వానికి వెలివేత భయం. ధనవంతునికి రాజు ద్వారా భయం. అభిమానవంతునికి దీనత్వ భయం. బలవంతునికి శత్రువుల భయం. రూపవంతులకు ముసలితనం వల్ల భయం. శాస్త్రం నేర్చిన వానికి వాదభయం. గుణవంతునికి దుష్టుల వలన భయం. ఎల్ల శరీర ధారులకు మృత్యుభయం. ఈలోకంలో మానవునికి ఏవస్తువును పొందినా భయమే. భోగాలన్నీ అస్థిరాలే. వైరాగ్యం మాత్రమే అభయాన్నిచ్చేది. అదే శ్రేష్ఠమైనది.

ఉజ్జ్వలమైన యవ్వనం ముసలితనమనే దోషాన్ని కలిగిఉంది. జన్మకు మరణం దోషం. ధనాశచే సంతోషం, ప్రౌఢాంగనల విలాసంచే సుఖశాంతులు

మాత్సర్యంచే గుణాలు, అరణ్యాలు సర్పాలచేత, రాజులు దుర్మార్గులైన మంత్రుల చేత దారిద్ర్యం చేత సంపదలు దోషభూయిష్ఠమై నాశనమగుచున్నవి.

ఈ ప్రపంచంలో మనిషికి ఏది లభించినా అది అశాశ్వతమే. జనుల ఆరోగ్యాన్ని వ్యాధులు, మనోవ్యధ బాధిస్తుంది. సంపదలు కలిగిన చోటే కష్టాలు కూడా ఉంటాయి. అకాలమృత్యువు అందరినీ బాధిస్తుంది. విధి నిరంకుశమైనది.

ఈ భోగాలన్నీ చంచలాలే. ఎత్తైన అలల వలే ఎగసిపడి నశించేవే. ప్రాణం పోయేదే. స్త్రీలతో సుఖం కొన్నాళ్ళే. ఈ సత్యాన్ని గ్రహించి మానవుడు సంతోషంగా పరబ్రహ్మ చింతన చేయాలి.

భోగాలు మెరుపుతీగ వంటివి. బ్రతుకు తామరాకుపై గాలికి కదలాడే నీటిబొట్టు. యవ్వనసుఖాలు తాత్కాలికాలు. కావున మానవుడు పరబ్రహ్మం నందు మనస్సును లగ్నం చేయాలి.

మానవుడు తన శరీరాన్ని గుండ్రంగా విల్లువలే వంచుకొని నరకం వంటి గర్భంలో ఉంటాడు. ఇది దుఃఖం. యవ్వనంలో తరుణీ వియోగం దుఃఖం. ముసలితనం దాపురించినపుడు యువతులు పరిహసించుట దుఃఖం, సుఖమెక్కడ? ఎప్పుడీ జీవితంలో సుఖపడేది?

పొంచిఉన్న పెద్ద పులిలాంటిది ముసలితనం. పగ సాధించే శత్రువుల వంటివి రోగాలు. ఓటికుండలో నీటివంటిది ఆయుష్షు. అయినా మనిషి పాపకృత్యాలను మానకపోవడం ఆశ్చర్యమే.

అనేక రకాలైన ఈభోగాలు క్షణభంగురమైనవి. దుఃఖ దాయకాలైనవి. ఇక వాటికై పరిభ్రమించుట వ్యర్థం. మనస్సును కుదుట పరచుకొని శివుని పాదాలు కొల్చుటే శ్రేయస్కరం.

పుణ్యాత్ముడు బ్రహ్మానందాన్ని రుచిచూసి, బ్రహ్మేంద్రాది దేవతల నందరిని గడ్డిపోచగా భావించును. ప్రపంచాధిపత్యాన్ని కూడా సారహీనంగా తలచును. అతని దృష్టిలో సారవంతమైనది పరబ్రహ్మ ఒక్కటే. ఉన్నతమైనది బ్రహ్మానంద మొక్కటే.

కావున ప్రాపంచిక భోగాలకోసం, ఎండమావుల వెంట దప్పికతో తిరిగినట్లు తిరగక భగవంతుని వైపు మరళితే శాశ్వతానందాన్ని పొందవచ్చునని తెలియ జేసిన భర్తృహరి, కాలమహిమాను వర్ణన ప్రారంభిస్తున్నాడు.

## కాలమహిమాను వర్ణన

భోగాలన్నీ శాశ్వతాలు కావు, భగవంతుని పాదాలే శాశ్వతం. అవి కాలం యొక్క గాలానికి చిక్కవు. కాలం మహిమోపేతమైనది. అగ్ని సర్వాన్ని దహించినట్లు కాలం అన్నింటినీ తనలో ఇముడ్చుకొంటుంది. కాలం ఒక ప్రవాహం, అందులో కొట్టుకుపోని వస్తువు ఈ ప్రపంచంలో ఏదీలేదు. కాలాతీతుడు భగవంతుడు మాత్రమే.

ఒక అందమైన నగరం ఉండేది. దాన్ని ఒక గొప్ప రాజేంద్రుడు పాలించేవాడు. అతని చుట్టూ అనేకులైన సామంతరాజులుండేవారు. ప్రక్కనే పండితసభ నడిచేది. అతని అంతఃపురంలో చాలామంది స్త్రీలు ఉండేవారు. వారంతా చంద్రుని వంటి ప్రసన్న సుందరమైన ముఖాలతో వెలిగిపోయేవారు. రాజుకు సమఉజ్జీలుగా తయారవుతున్న రాజకుమారులుండేవారు. రాజును కీర్తించే వందిమాగధ బృందాలకు కొదువలేదు. ఆవైభవం, ఆ కథలూ, అవన్నీ ఇప్పుడు గతవైభవాలే పాత జ్ఞాపకాలే, అలా చేయగలిగిన, చేసినవాడు కాలపురుషుడు, అతనికి నమస్కారం.

"కాలాయ తస్మైనమః"

కాలపురుషుని దృష్టిలో ఈలోకం ఒక పాచికల పలక. పగలు, రాత్రి రెండు సారెలు. ఆయన వాటిని దొర్లిస్తూ ఉంటాడు. వాటిఫలితంగా చాలామంది నివసించే ఇంట్లో రాత్రికి రాత్రి ఒక్కరే మిగిలిపోతుంటారు. ఒక్కడే ఉన్న ఇంటికి బంధువులు, స్నేహితులు వచ్చి చేరుతుంటారు, కొన్ని ఇండ్లు ఖాళీ అవుతాయి. కొన్ని ఖాళీ ఇండ్లు నిండుతూ ఉంటాయి.

సూర్యుడు ఉదయించి, అస్తమించగానే పగలు, తిరిగి ఉదయించగానే రాత్రి వెరసి, ఒకదినం గడుస్తుంది. గడిచింది ఒక దినమనుకొంటే పొరబాటే. మనిషి ఆయుష్షులో ఒకదినం తగ్గిపోయినట్లు భావించాలి. మరణానికి మరొక్క రోజు దగ్గరైనట్లు తెలుసుకోవాలి. అనేక వ్యాసంగాల్లో మునిగిపోయిన మనిషి దీనిని

గమనించడం లేదు. తన కళ్ళెదుట పుడుతున్నవారిని, వయసు మీరుతున్న వారిని, చనిపోతున్న వారిని చూస్తూనే ఉన్నా భయపడటం లేదు. ప్రపంచమంతా వ్యామోహమనే మత్తులో మునిగిపోయింది.

వచ్చిన రాత్రులే వస్తున్నాయి. పోయిన ప్రొద్దులే వస్తున్నాయి. ఇది అందరికి తెలుసు. అందుకే చేసిన పనులే మరళ మరళ చేస్తూ ఒక స్థిరవృత్తికి అలవాటు పడి మానవులు జీవిస్తున్నారు. ఈ సంసారంవల్ల దుఃఖితులై కూడ దీనిపట్ల మానవులు విరక్తిని పొందుట లేదు. కాంతిచే మనోహరమైన శివపాదధ్యానం చేయుట లేదు. స్వర్గద్వారాన్ని తెరిచే ధర్మాన్ని ఆచరించుట లేదు. కలలో కూడా యువతుల స్తనాలు, తొడలను గురించిన ఆలోచనలే. ఇటువంటి వారంతా తల్లి యవ్వన వనానికి గొడ్డలులై జన్మించిన వారే. భగవంతుని ధ్యానించని జన్మలు వృథా, వృథా!

యవ్వనం శాశ్వతం కాదు. ముసలితనం, మృత్యువు ఒకదానివెంట ఒకటి పోటీపడి యవ్వనాన్ని ఆక్రమించాలని చూస్తుంటాయి. అందుకే యవ్వనం లోనే ప్రతివాదిని జయించగల్గినంత చక్కని చదువు చదువుకోవాలి. ఏనుగుల కుంభ స్థలాన్ని చీల్చగల్గిన శౌర్యంతో స్వర్గం వరకు కీర్తిని విస్తరింపచేసుకోవాలి. ఇవేవీ చేయకపోయినా కనీసం చంద్రోదయం వేళలో చిగురువలే మృదువైన కోమలాంగుల అధరామృతమైనా త్రాగాలి. ఇవేవీ చేయని యవ్వనం పాడుబడిన ఇంటిలో దీపంవలే వృథా! వృథా!

కళంకరహితుడై విద్యల నేర్వాలి. న్యాయంగా ధనార్జన చేయాలి. తల్లిదండ్రులకు సేవచేయాలి. బిత్తర చూపులుగల స్త్రీల కౌగిల్లలో సుఖించాలి. అంతేకాని ఎంగిలి మెతుకులు తినే కాకివలే కాలాన్ని వృథా చేయరాదు.

జన్మనిచ్చిన తల్లిదండ్రులతో హాయిగా ఉన్నప్పుడు, కాలం మృత్యురూపంలో వారిని కబళిస్తుంది. అప్పుడే తెలుసుకోవాలి, మృత్యువు పొంచిఉందని. కాలం గడుస్తుంది. ముసలితనం వస్తుంది. ఆ దుర్దశలో నదీతీరంలో ఇసుకతిన్నెల మీద చెట్లవలె కాలప్రవాహంలో కొట్టుకుపోవడానికి సిద్ధంగా ఉంటారు.

మానవుని ఆయుష్షు నూరేండ్లు. దానిలో సగం రాత్రి, నిద్రలో గడచిపోతుంది. మిగిలిన సగంలో కొంతకాలం బాల్యం, కొంతకాలం ముసలితనం. కొంతకాలం

రోగాలు, కొంతకాలం సేవ అంటే ఉద్యోగం, మరికొంత కాలం లేనిదాన్ని కోరి దుఃఖించడం, ఇంకొంతకాలం ఉన్నది పోలేదనే దుఃఖం. ప్రాణం నీటి అలల్లా చలించిపోతుంది. ఇంకెక్కడి ఆనందం?

మానవుడు గొప్ప నటుడు. కొంతకాలం బాలుడుగా, మరికొంతకాలం యువకుడుగా, కొన్నాళ్ళు దరిద్రుడుగా, ఇంకొన్నాళ్ళు ధనవంతుడుగా, చివరకు వృద్ధుడుగా నటిస్తాడు. ఈ వేషాలన్నీ పూర్తికాగానే యముని సన్నిధానం అంటే మృత్యువనే తెరవెనుకకు వెళ్ళిపోతాడు.

ఈ విధంగా కాలమహిమను వర్ణించిన భర్తృహరి, రాజుకు, సన్న్యాసికి మధ్యగల తారతమ్యాన్ని 'యతి-నృపతి సంవాదం' ద్వారా వివరిస్తున్నాడు.

## యతి - నృపతి సంవాదం

ఒకానొక రాజు వద్దకు ఒక సన్యాసి వచ్చాడు. రాజుతో సన్యాసి ఇలా అంటున్నాడు. "నీవు రాజువు, మేము గురువులను ఆరాధించడం వల్ల జ్ఞానాన్ని, అభిమానాన్ని కలిగిన వారము. నీవు ధనం వల్ల ప్రసిద్ధిని పొందినావు. మా కీర్తిని కవులు పొగుడుతారు. ఈవిధంగా ధనంలేని వారమైనప్పటికి అభిమాన ధనం కలిగిన మమ్ము నిష్కపటంగా మీరు గౌరవించనిచో మీపై మాకు ప్రేమ ఉండదు. మీకు - మాకు మధ్య చాలా ఎడం ఉన్నది.

ఓరాజా! నీవు ధనాన్ని శాసిస్తావు. మేము వేదాంతవాక్యాల అర్థాన్ని శాసిస్తాము. నీవు యుద్ధంలో శూరుడవు. మేము వాదంలో శూరులం. ప్రతివాది గర్వాన్ని అణచే విధంగా వాదించగలం. నిన్ను ధనవంతులు సేవిస్తారు. మమ్ములను జ్ఞానం కోరేవారు ఆశ్రయిస్తారు. మాపట్ల నీవు వినయం చూపనిచో ఈక్షణమే వెళ్ళిపోతాం. అంతేగాని నీ కటాక్షం కొరకు ప్రాకులాడం.

అంతేకాక ఓరాజా! చక్కని పట్టువస్త్రాలు కట్టిన నీకు, చినిగిన వస్త్రం ధరించిన మాకూ సంతోషం సమానమే. ఇందులో విశేషమేదీ లేదు. ఎవనికి ఆశ ఎక్కువగా ఉండునో అతడే దరిద్రుడు. సంతృప్తితో వికసించిన మనస్సు గలవారికి దారిద్ర్యం, ఐశ్వర్యం అనే తేడా ఉండదు.

ఆకలికి పండ్లు, త్రాగడానికి మంచినీళ్ళు, పడుకోవడానికి నేల, కట్టుకోవడానికి నారచీరలు చాలు. కానీ, రాజులు ధనం, నూతన వస్త్రాలు, మద్యం మొదలగు వ్యామోహాలలో చిక్కుకొన్నారు. వారి ఇంద్రియాలు వశం తప్పిపోయాయి. వారి విలాసాలకోసం ప్రజలను పీడించే దుర్నీతిని మాలాంటి వారు సహించరు సుమా!

రాజులు మాపై కోపగించుకొంటారనే భయం మాకులేదు. ఎందుకంటే మేం భిక్షాన్నాన్ని తింటాం, దిగంబరంగా ఉంటాం. నేలపై పడుకొంటాం. మేం నటులం గాము, గాయకులం కాదు, పెద్ద పెద్ద స్తనాల బరువుచే వంగిన వేశ్యా స్త్రీలము కాము, మాకు రాజులతో పనిలేదు.

విపుల హృదయం కలిగిన రాజులు ముందు ఈరాజ్యాలను ఏర్పరచి, వాటిని సంరక్షించారు. కొందరు రాజ్యసంపదలను తృణంగా భావించి ఇతరులకు దానంచేశారు, కొంతమంది లోకాలన్నింటిని పరిపాలించారు, పాలిస్తున్నారు. కాని అరచేయంత రాజ్యానికి అధికారులైన రాజులు మదాతిరేకంతో ఉండటం విచిత్రంగా ఉంది.

క్షణకాలం కూడా ఖాళీలేకుండా ఈ భూమి ఎందరో రాజులచేత అనుభవింప బడుతూనే ఉంది. అటువంటి ఈభూమిలో ఏ శతాంశానికో, సహస్రాంశానికో ఒక చిన్న తునుకకు రాజైనందుకు చింతించకుండా, సంతోషిస్తున్నారు – మీరాజులు ఎంతమూర్ఖులో గదా!

ఓరాజా! సముద్రంచే ఆవరింపబడిన మట్టిముద్ద ఈ భూమి. దీనికోసం తగువులాడుకొని, విభాగించుకొని అనుభవిస్తున్న నీచపు రాజులు – పూర్వపు రాజుల వలే ఈ భూమిని దానం చేయగలరా? ఈ నీచరాజుల్ని ధనాపేక్షతో పొగుడుతూ సేవించే మనుష్యులు అధములు గదా!

ఎవని పరిశుభ్రమైన తలపుర్రెను శివుడు ఆభరణంగా ధరిస్తాడో వాని జన్మధన్యమైనది. ప్రాణరక్షణ చేస్తారని కొందరు అమాయక ప్రజలు రాజులను ఆశ్రయిస్తుంటారు. దానితో మేము రక్షకులమనే మదం రాజులకు పెరిగిపోతూ ఉంటుంది. నిజానికి లయకారకుడు శివుడై ఉండగా ఈరాజులు అతణ్ణి ఎదిరించి ప్రాణరక్షణ చేస్తారా?"

– అని సన్యాసి రాజుతో సుదీర్ఘ సంభాషణ చేసెను. ధనం, అధికారం సంతోషానికి కారణాలు కావు. మనస్సే కారణం, వైరాగ్యమే మూలం. ఈసత్యాన్ని తెలియజేసిన భర్తృహరి మనస్సు యొక్క తీరును విశ్లేషిస్తున్నారు.

## మనస్సంబోధన నియమనము

మానవునికి అనేకమైన ఆశలుంటాయి. వాటిని ఎవరెవరో తీరుస్తారని అనుకొంటాడు. అందుకై వారి మనస్సులను మెప్పించడానికి ఆరాట పడతాడు. కాని, మనిషికి ఆనందం ఇతరులద్వారా ఎప్పుడూ రాదు. తనవల్లనే తనకు ఆనందం, తనవల్లనే తనకు దుఃఖం. ఈ సుఖదుఃఖాలకు మనస్సే కారణం. ఆ మనస్సును నిర్మలంగా ఉంచుకోగలిగితే అది కోరిన వస్తువులన్నీ ఇచ్చే చింతామణితో సమానమౌతుంది.

మనస్సు ఒకచోట విశ్రమించదు. పరిభ్రమిస్తూనే ఉంటుంది. మనస్సెంత ఆరాటపడినా జరుగవలసినది ఆగదు, జరుగకూడనిది జరుగదు. మానవుడు దైవికముగా లభించిన దానితో తృప్తిచెందాలి. అధికంగా ఆశించకూడదు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే ఇంద్రియ విషయాలు మనస్సును, తద్వారా మనిషిని ఆయాసకు లోనుచేస్తాయి. అన్ని బాధలని తొలగించే సన్మార్గాన్ని అవలంభించాలి. మనస్సును నిశ్చలంచేసుకొని పరమేశ్వరుని ధ్యానించాలి. మాయామయమైన ఇంద్రియ విషయ మాలిన్యాలను వదలాలి.

శివునిపై వ్యామోహాన్ని పెంచుకోవాలి. గంగాతీరంలో నివసించాలి. తెలివైన వాడు అలలను, నీటిబుడగలను, మెఱుపును, జారస్త్రీలను, జ్వాలలను, పాములను, ప్రవాహాలను నమ్మడు. అటువంటివే ఈ భౌతిక సంపదలు కూడా! వాటిపై వ్యామోహం కూడా అపాయమే.

వారస్త్రీలు రాజుల కనుసన్నలలో బ్రతుకుతుంటారు. రాజుల కనుసైగ మేరకు ప్రవర్తిస్తుంటారు. వారిని అనుభవించాలను కోవడం మూర్ఖత్వం, దానివల్ల కలిగే భోగం కంటే కాశిలో భిక్షాటన చేయడం ఉత్తమం. అది శివునికి కూడా ఇష్టమైన పని.

మానవులు సంసారాన్నే కోరుకొనేటట్లయితే వారికి మణి కంకణాలతో మెరుస్తూ ఉన్న చేతులు గల స్త్రీలు చామరాలు వీస్తూ ఉండాలి. మధురమైన

గానం ఉండాలి. సరసులైన దాక్షిణాత్యకవులుండాలి. ఇవేవి లేనిచో ఆనంద దాయకమైన నిర్వికల్ప సమాధిని పొందాలి.

మానవుడు అన్నికోరికలు తీరే సంపదలను పొందుతాడు. తరువాత ఏమిటి? శత్రువులను నిర్మూలిస్తాడు, తరువాత, బంధువులను, స్నేహితులను పోషిస్తాడు. తరువాత ఆరోగ్యవంతమైన శరీరాన్ని పొందుతాడు. తరువాత ఏమిటి? ఏంచేయాలి?

శివుని పాదాలపై భక్తి ఉండాలి. జరామరణ భయాన్ని విడిచిపెట్టాలి. బంధువులపై వ్యామోహం లేకుండా ఉండాలి. కామ నిగ్రహం ఉండాలి. మునులు నివసించే నిర్జనమైన వనప్రదేశాలుండాలి. వైరాగ్యం ఉండాలి. ఇంతకంటే భాగ్యమే ముంటుంది.

పరబ్రహ్మం అంతంలేనిది. ముసలితనం లేనిది, నాశనం లేనిది, పుట్టుక లేనిది. అందువల్ల అదొక్కటే సేవించదగినది. మనోవికారాలు మానిన మానవునికి, బ్రహ్మధ్యానం చేయు మానవునికి లోకాధిపత్యభోగం కూడా నీచమైనదే. మానవుని మనస్సు పాతాళానికి వెళ్తుంది, ఆకాశాన్ని దాటిపోతుంది. అన్నిదిక్కులకూ వ్యాపిస్తుంది. కాని తనలోనే ప్రకాశించే పరబ్రహ్మం వైపు మాత్రం చూడదు. మనసు గనుక ఆవిధంగా చూచి, స్మరిస్తే శాశ్వతసౌఖ్యాన్ని పొందుతుంది.

అని మనస్సు చలించడం ద్వారా సుఖంలేదని చెప్పిన భర్తృహరి, నిత్యానిత్య వస్తు విచారమును ప్రారంభిస్తున్నాడు.

## నిత్యానిత్య వస్తు విచారము

సాధారణంగా మనిషి వస్తువుల ద్వారా సుఖం లభిస్తుందని అనుకొంటాడు. అందుకే సంతలో దొరికే ప్రతివస్తువును కొనాలని ఆరాటపడుతూ ఉంటాడు, కొంటుంటాడు. కాని వాటిద్వారా సుఖం తాత్కాలికమే. కారణం, ఆ వస్తువులే శాశ్వతం కాదు కాబట్టి.

వేదాలు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలు పఠించినా, స్వర్గం వంటి గ్రామ కుటీరాల్లో నివసించినా, ఉత్తమ కర్మలు చేసినా ఫలితమేమి ఉండదు. సంసార దుఃఖాన్ని రూపుమాపే ఆత్మానంద పదప్రవేశం మినహా మిగిలిన వన్నీ కోమటి బేరాలే.

శరీరం శాశ్వతం కాదు. ప్రళయాగ్ని జ్వాలలకు దృఢమైన మేరు పర్వతం కూడా కరిగిపోతున్నది. మొసళ్ళు నివసించే మహాసముద్రాలు కూడా ఎండి పోతాయి. పర్వతాలచే భరింపబడుచున్న భూమి పాడయిపోతుంది. మరి ఏనుగు చెవులవలే నిత్యం చలించే శరీర విషయాన్ని గూర్చి చెప్పాలా? అదీ పోయేదే.

సరే, పోవడం సంగతి అలా ఉంచితే అంతకంటే ముందు ముసలితనం వస్తుంది. శరీరం ముడుతలు పడుతుంది. అడుగులు తడబడతాయి. పండ్లూడి పోతాయి. కనుచూపు తగ్గుతుంది. వినికిడి తగ్గుతుంది. చొంగకారుతూ ఉంటుంది. మనుష్యులు మాట వినరు. భార్య దగ్గరకు రాదు. పుత్రుడు శత్రువు వలే సంచరిస్తాడు. ఇటువంటి ముసలితనంలో కూడా భగవంతుడు గుర్తు రాకపోవడం ఎంత అవివేకం?

బావి దగ్గర ఎముకలను చూసి, అది అశుచియని జనులు బావికి దూరంగా జరిగిపోతారు. ఎముకలవలే తెల్లగా ఉన్న వెంట్రుకలను చూచిన యవ్వనవతులు వీడు పనికిరాడని దూరంగా వెళ్ళిపోతారు. ఇవన్నీ ఒకవైపు, రోగాలు మరోవైపు, తెలివైనవాడు ఇంద్రియపటుత్వం తగ్గకముందే ప్రాణప్రయాణకాలం దాపురించక ముందే మోక్షం కోసం ప్రయత్నించాలి. ఇల్లు తగులబడుచుండగా బావి త్రవ్వుట ఎంత తెలివి?

గంగాతీరంలో తపస్సు చేయాలా? భార్యపై ఆసక్తితో ఉండాలా? శాస్త్రాలు చదివి, కావ్యామృతాన్ని ఆస్వాదించాలా? ఏది హితం? ఏది హితమో తెలుసు కోవాలి. ఎందుకంటే మానవుడు తరువాతి నిమిషంలో ఏమవుతాడో తెలియదు. అందుకే కర్తవ్యం పట్ల నిశ్చయబుద్ధి ఉండాలి.

రాజులు గుఱ్ఱాలవలే చంచల స్వభావం కలిగినవారు. వారికి శాంతగుణం ఉండదు. కేవలం రజోగుణమే. ధనంపై దురాశ. ఇంతలో ముసలితనం చుట్టు ముట్టుతుంది. యముడెదురు పడుతాడు. ఇప్పుడు ఎవరిని ఆశ్రయించాలి? ఈదశలో తపస్సు కంటే హితమైన పని వేరొకటి లేదు.

గౌరవం పోయి, ధనం తరిగిపోయి, చుట్టాలు, ఆశ్రితులు దీనదశనొంది, యౌవనం నశించి, ఇంటికి వచ్చిన అతిథులు నిరాశతో వెనుదిరిగినప్పుడు మానవునికి గంగాతీరంలో పవిత్రమైన రాళ్ళు గల పొదరిండ్లు ఆశ్రయం కావాలి. అక్కడితపస్సు అన్ని కష్టాలను హరిస్తుంది.

పండువెన్నెలలు, పూదోటలు, సజ్జన సాంగత్యం, సరస వచనాలు, కోపంతో కన్నీరు కారుస్తున్న రమ్యమైన ప్రియురాలి ముఖం ఇవన్నీ అజ్ఞానికి సుఖదాయకాలుగా కన్పిస్తాయి. జ్ఞానికి అవి దుఃఖదాయకాలు.

విశాలమైన మేడలు, స్త్రీ సంభోగం, మధురగానం మొదలగునవి శాశ్వతమైన సుఖాన్ని ఇవ్వవు. దీపం వెలుగుతూ ఉంటుంది. పక్షులు ఱెక్కలు ఆడిస్తూ ఇటూ అటూ తిరుగుతూ ఉంటాయి. దీపశిఖ చలిస్తూ ఉంటుంది. ఏక్షణంలోనైనా ఆరిపోతుంది. ప్రాణదీపం కూడా అంతే. ఈ సత్యం తెలుసుకొన్న మహాత్ములు అరణ్యాలకేగి తపస్సు ప్రారంభిస్తారని నిత్యానిత్య వస్తు విచారాన్ని తెలియజేసిన భర్తృహరి, శివార్చనం, అవధూత చర్యలతో వైరాగ్య శతకాన్ని ముగించ బోతున్నాడు.

## శివార్చనము

మానవుని సుఖదుఃఖాలకు మనస్సే కారణం. అది ఏకాగ్రమైతేనే సుఖం కలుగుతుంది. హఠాది యోగసాధనాలకంటే సులభమై, ఎక్కువ ఫలితాన్నిచ్చేది భక్తి. మనస్సును శివునిపై నిల్పి ఆరాధన చేయాలని భర్తృహరి శివార్చనం అనే దశకం ద్వారా ప్రబోధిస్తున్నాడు.

జీవి కర్మబద్ధుడు. ఆకర్మ సంబంధం వల్ల సంసారంలో చిక్కుకొని ముల్లోకాల్లో సంచరిస్తూ ఉంటాడు. అనేకయోనులందు జన్మిస్తూ ఉంటాడు. ప్రతిచోట తాత్కాలికమైన సుఖాలు ఉంటాయి. ఆ సుఖాలు ఆడ ఏనుగుల వంటివి. మనస్సు మదగజం వంటిది. దానికి ఆడ ఏనుగులపై ఉన్న ఆసక్తివల్ల పరుగులుతీస్తూ ఉంటుంది. దాన్ని బంధించడానికి దృఢమైన స్తంభమేదీ కన్పించుటలేదు. వినిపించుట లేదు. సంసారంలో ఇంద్రియ నిగ్రహం కలవాడెవడూ లేడు.

స్వేచ్ఛావిహారం, నీచత్వం లేని ఆహారం, ఎల్లప్పుడు సజ్జన సహవాసం, పరిశుద్ధమైన శాంతం, శాస్త్రజ్ఞానం, వీటితోపాటు లోపల ఆసక్తిఉన్నా బయట వస్తువులు చేరని నిగ్రహం ఇవన్నీ గొప్ప తపస్సు వల్ల లభిస్తాయి.

కోరికలు మనస్సులోనే హరించిపోవును. యవ్వనం నశించి దేహ పటుత్వం సడలును. గుణవంతులు లేనిచో గుణములే నిరర్థకములై పోవును. ఇక మరణమా? ఆగదు, అటువంటి సందర్భంలో చేరదగినది శివుని పాదయుగళమే.

ప్రపంచాన్ని అనుశాసించే శివునియందు, సకలజగాలలో పరివ్యాప్తమై ఉన్న విష్ణువుయందు సమత్వాన్ని కలిగిఉండాలి. ప్రశాంతమైన అర్ధరాత్రిలో దట్టంగా ప్రకాశించే వెన్నెలలో శుభ్రమైన గంగానది ఇసుకతిన్నెలపై కూర్చొని శివ, శివ యని ధ్యానించాలి. అది రసానందస్థితి, ఆనందభాష్పాలు రాలుచుండగా సుఖంగా ఉండాలి.

ఉన్న ధనమంతా దానం చేయాలి. మనస్సు నిండా దయను నింపుకోవాలి. దానితో సంసారమంతా నశించిపోతుంది. అరణ్యం చేరుకోవాలి. శివున్ని మనస్సులో నిలిపి ధ్యానం చేయాలి. శరదృతువులోని వెన్నెల రాత్రులు శివారాధనకు అనుకూలమైనవి. ఇలాంటి కోరిక మానవునికి కలగాలి.

కాశీక్షేత్రంలో గంగాసమీపంలో గోచితో నిలబడి, తలపై చేతులు మోడ్చి, గౌరీనాథ! త్రిపురహర! త్రినయన! శంభో! అని ప్రార్థన చేసి, రక్షించమని వేడుకొంటూ నిశ్చలధ్యానంతో దినాలను నిముషాల వలే గడపాలి.

మానవుడు తన ఉదరపోషణ నిమిత్తం ధనవంతుల, రాజులసేవలో గడిపి గడించుకొన్న పాపం ఎలాపోతుంది? కేవలం శివున్ని ధ్యానించడం వల్లనే. నెమ్మదిగా ఒక గుహలో ఱాతిపై కూర్చొని, గురువుగారు ఉపదేశించినట్లు ఆత్మధ్యానం చేసుకోవాలి. ఫలాహారం భుజించాలి. అప్పుడు రాజులను సేవించిన దోషం పోతుంది. చివరకు దిగంబరుడై, ఒంటరిగా, భిక్షాపాత్ర చేతబట్టి హరనామ స్మరణ చేస్తే కర్మ నిర్మూలనమౌతుంది.

హితునకు, అరచేత పాత్ర గలవానికి, కోరికలు లేనివానికి, భిక్షాన్నంతో తృప్తినొందు వానికి, ఏస్థలంలోనైనా నివసించువానికి, విశ్వాన్ని గడ్డితో సమానంగా భావించేవానికి, అఖండమైన సౌఖ్యంతో ఉన్న యోగికి శంకరుని దయచే మోక్ష మార్గమేర్పడునని భర్తృహరి శివార్చనా వైభవాన్ని తెలియజేసి అవధూత చర్యను ప్రారంభిస్తున్నాడు.

## అవధూత చర్య

ఇహలోక స్పృహకాని, పరలోక స్పృహకాని లేని సాధకులను అవధూతలు అంటారు. చినిగిన గోచి, చినిగి, నూరుముక్కలు అతుకులు వేసి కుట్టిన బొంత,

ఎవరైనా పిలిచి పెడితే తినడం, లేకుంటే అలాగే నిరాహారులై ఉండటం, ఏం జరిగినా చింతలేకుండా ఉండటం, ఏ అరణ్యంలోనో, స్మశానంలోనో నిద్రపోవడం, సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించడం, ప్రశాంతమైన మనస్సు, స్థిరమైన యోగాభ్యాసం - ఇవన్నీ అలవడిన అవధూతలు ముల్లోకాధిపత్యాన్ని కూడా కోరుకొనరు.

యతికి బ్రహ్మాండమంతా ఒక ప్రదేశంగానే కనిపిస్తుంది. బ్రహ్మాండం, అందులోని సుఖాలు ఏవీ అతన్ని ఆకర్షించవు. ఒకానొక మహాసముద్రంలో చేపలు ఎగిరి తిరిగినంత మాత్రాన కల్లోలం జరగదు కదా!

లోకంలో మానవులంతా భోగాలపై ఆసక్తితో ఉన్నారు. విరక్తి కలుగదు. నిస్పృహ లేనివారికి బంధముక్తి కలుగదు. పవిత్రమైన భిక్షావృత్తితో సంతృప్తి లభించుట లేదు. ఎంత సంపద లభించినా హృదయంలో జ్ఞానం దూరం కాకుండా ఉండాలి. విద్యను దూరం చేయకుండా ఉండమని లక్ష్మీదేవిని ప్రార్థించాలి.

భూమి పడకగా, భుజం దిండుగా, ఆకాశం పైకప్పుగా గాలి విసనకర్రగా, చంద్రుడు దీపంగా, వైరాగ్యమే యువతిగా సంతోషంగా సుఖంగా గడిపే యతిరాజు, రాజుకంటే గొప్పవాడు.

అవధూత జనం మధ్యలో ఒంటరిగా ఉండగలడు. ఇవ్వడం, తీసుకోవడం ఏవీ అతనికి ఆసక్తిని కలిగించవు. తన ప్రవర్తన తన అదుపులో ఉంటుంది. అహంకార, మమకారాలు లేకుండా ఉంటాడు. నిరంతరం పరమాత్మ ధ్యానంలో ఉంటాడు. ఏ వికల్పాలు లేని జడుడు లాగా కన్పించినా, నిత్య చేతనావస్థలోనే ఉంటాడు.

యోగులకు తనను సమీపించిన వ్యక్తి, చండాలుడా? బ్రాహ్మణుడా? శూద్రుడా? అనే స్పృహ ఉండదు. ఒకవేళ యోగులపట్ల ప్రజలకు ఇటువంటి భావనలు కలిగినా వారు పట్టించుకోరు, అవధూతలను అసహ్యించుకొన్నా, నిందించినా వారు కోపగించుకోరు, పైగా సంతోషిస్తారు. ఎందుకంటే ఏ శరీరం అశాశ్వతమని వారు అసహ్యించుకొన్నారో దానినే ఇతరులు నిందించడం వారికి సంతోషదాయకమే కదా! అంటే వారికి దేహదృష్టి ఉండదన్నమాట. ఎవ్వరితోనూ మారు పలుకక యోగులు నిరంతరం మౌనంగా ఉంటారు.

భగవంతుడు పాముకు గాలిని, గోవులకు గడ్డిని ఆహారంగా కల్పించాడు. ఇలా భగవంతునిచేత కల్పించబడిన ఆహారం వల్ల హింసాదోషం సంభవించదు. పరమాత్మను ధ్యానిస్తూ, నేలపై శయనిస్తూ, భిక్షాటన ద్వారా కడుపు నింపు కోవడం– సంసార సాగరాన్ని దాటాలనుకొనే వారికి భగవంతుడు ఏర్పాటు చేసిన వృత్తి. దీనివల్ల తమోగుణ, రజోగుణాలవల్ల కలిగే దోషాలు తొలగిపోతాయి.

యోగులు గంగాతీరంలో, హిమాలయ సానువుల్లో, పద్మాసనం వేసికొని తపస్సుచేస్తూ ఉంటారు. జింకలు దురదపుట్టి, వారిని విగ్రహాలుగా భావించి యోగుల శరీరానికి తమ దురద ప్రదేశాలను రుద్దుకొంటూ ఉంటాయి. యోగులు నిశ్చలంగా ఉంటారు. అదే సిద్ధస్థితి.

మానవుని మనస్సులో కర్మబీజాలు అంతర్గతంగా ఉంటాయి. అవి ఏదో ఒక సమయంలో ఉద్బుద్ధమౌతాయి. ఈ భూమిమీద సంగరహితులైన వారు ఆ బీజాలను దగ్ధంచేస్తారు. వారికి భిక్షాపాత్ర కూడా ఉండదు, అరచేతితోనే భిక్షను గ్రహిస్తారు.

అవధూతకు తల్లి భూమి, తండ్రి వాయువు, అగ్ని స్నేహితుడు, నీరే చుట్టం, అకాశమే సోదరుడు, వీరందరి సహకారంతో కలిగిన పుణ్యం వల్ల అజ్ఞానం నశిస్తుంది. జ్ఞానం కలుగుతుంది. పరమాత్మను చేరుకొంటాడు. ఇదే తురీయ పురుషార్థం.

ఇలా ధర్మార్థకామమోక్షాలను వివేచించి, సత్యాన్ని గ్రహించి, పరమాత్మను చేరుకోవడానికి కావలసిన ప్రాతిపదికలను మూడువందల శ్లోకాల ద్వారా వివరించిన భర్తృహరి వైరాగ్య శతకాన్ని ముగించారు. దీనితో భర్తృహరి రచించిన సుభాషిత త్రిశతి వచనానువాదంముగిసింది.



# అనుబంధం-1

## నీతిశతకము

శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్త చిన్మాత్ర మూర్తయే ।
స్వానుభూత్యేకమానాయ నమశ్శాన్తాయతేజసే ॥

### మూర్ఖపద్ధతి

శ్లో॥ బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతాశ్చాన్యే జీర్ణ మంగే సుభాషితమ్. 1

శ్లో॥ అజ్ఞః సుఖమారాధ్యస్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి. 2

శ్లో॥ ప్రసహ్య మణిముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాన్తరా
త్సముద్రమపి సంతరేత్ప్రచలదూర్మిమాలాకులం ।
భుజఙ్గమపి కోపితం శిరసి పుష్పవద్ధారయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్తమారాధయేత్ ॥ 3

శ్లో॥ లభేత సికతాసు తైలమపి యత్నతః పీడయన్
పిబేచ్ఛ మృగతృష్ణి కాసు సలిలం పిపాసార్దితః ।
కదాచిదపి పర్యటన్ శశవిషాణ మాసాదయే
న్నతు ప్రతినివిష్టమూర్ఖజన చిత్తమారాధయేత్ ॥ 4

శ్లో॥ వ్యాళం బాలమృణాళతన్తుభి రసౌ రోద్ధుం సముజ్జృమ్భతే
భేత్తుం వజ్రమణిం శిరీషకుసుమప్రాన్తేన సన్నహ్యతి ।
మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారామ్బుధే రీహతే
మూర్ఖాన్యః ప్రతినేతు మిచ్ఛతి బలాత్సూక్తైః సుధాస్యన్దిభిః ॥ 5

శ్లో॥ స్వాయత్తమేకాన్తహితం విధాత్రా
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః,

విశేషతః సర్వవిదాం సమాజే
విభూషణం మౌన మపణ్డితానామ్. 6

శ్లో॥ యదా కించిద్జ్ఞోఽహం గజ ఇవ మదాన్ధః సమభవం
తదా సర్వజ్ఞోఽస్మీత్యభవ దవలిప్తం మమ మనః ।
యదా కించిత్కించిద్బుధజనసకాశా దవగతం
తదా మూర్ఖోఽస్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః ॥ 7

శ్లో॥ క్రిమికులచితం లాలాక్లిన్నం విగన్ధి జుగుప్సితం
నిరుపమరస ప్రీత్యా ఖాద న్నరాస్థి నిరామిషమ్,
సురపతిమపి శ్వా పార్శ్వస్థం విలోక్య న శఙ్కతే
నహి గణయతి క్షుద్రోజన్తుః పరిగ్రహఫల్గుతామ్. 8

శ్లో॥ శిరాశ్శార్వం స్వర్గాత్పశుపతిశిరస్తః క్షితిధరం
మహీధ్రాదుత్తుఙ్గా దవని మవనేశ్చాపి జలధిం ।
అథో గంగా సేయం పదముపగతాస్తోక మథవా
వివేక భ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః ॥ 9

శ్లో॥ శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేన్ద్రో నిశితాఙ్కుశేన సమదో దణ్డేన గౌ ర్గార్దభః ।
వ్యాధి ర్భేషజసఙ్గహైశ్చ వివిధైర్మన్త్రప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్ ॥ 10

శ్లో॥ శాస్త్రోపస్కృతశబ్దసున్దరగిరః శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయోవసన్తి విషయే యస్య ప్రభోర్నిర్ధనాః,
తజ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వర్థం వినాపీశ్వరాః
కుత్స్యాః స్యుః కుపరీక్షకైర్న మణయో యైరర్ఘతఃపాతితాః. 11

శ్లో॥ హర్తుర్యాతి న గోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదా
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్ ।

కల్పాన్తేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్య మన్తర్ధనం
యేషాం తాన్ప్రతి మానముజ్ఝత నృపాః కస్తైస్సహ స్పర్ధతే. 12

శ్లో॥ పరిగతపరమార్థాన్ పణ్డితాన్ మాఽవమంస్థా
స్తృణ మివ లఘు లక్ష్మీర్నైవ తాన్ సంరుణద్ధి,
అభినవమదరేఖా శ్యామగణ్డస్థలానాం
న భవతి బిసతన్తు ర్వారణం వారణానామ్. 13

శ్లో॥ అమ్భోజినీ వనవిహార విలాసమేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా ।
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః ॥ 14

శ్లో॥ కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం నాలఙ్కృతా మూర్ధజాః ।
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తేఽఖిలభూషణాని సతతం వాగ్భూషణమ్ భూషణమ్ ॥ 15

శ్లో॥ విద్యా నామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః ।
విద్యా బన్ధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా
విద్యా రాజసుపూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః ॥ 16

శ్లో॥ క్షాన్తి శ్చేత్కవచేన కిం కిమరభిః క్రోధోఽస్తి చేద్దేహినాం
జ్ఞాతి శ్చేదనలేన కిం యది సుహృద్దివ్యౌషధైః కిం ఫలమ్ ।
కిం సర్పైర్యది దుర్జనాః కిము ధనైర్విద్యాఽనవద్యా యది
వ్రీడా చేత్కిము భూషణై స్సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్ ॥ 17

శ్లో॥ దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవమ్ ।

శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా
యే చైవం పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః ॥ 18

శ్లో॥ జాడ్యం ధియో హరతి సిఞ్చతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి ।
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సఙ్గతిః కథయ కిం న కరోతి పుంసామ్ ॥ 19

శ్లో॥ జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్. 20

## మానశౌర్య పద్ధతి

శ్లో॥ క్షుత్క్షామోఽపి జరాకృశోఽపి శిథిలప్రాయోఽపి కష్టాం దశా
మాపన్నోఽపి విపన్నదీధితి రపి ప్రాణేషు నశ్యత్స్వపి,
మత్తేభేన్ద్ర విభిన్న కుమ్భపిశితగ్రాసైకబద్ధస్పృహః
కిం జీర్ణం తృణమత్తి మానమహతామగ్రేసరః కేసరీ ॥ 21

శ్లో॥ స్వల్పస్నాయువసావసేకమలినం నిర్మాంసమప్యస్థిగోః
శ్వా లబ్ధ్వా పరితోషమేతి న చ తత్తస్య క్షుధాశాన్తయే ।
సింహో జమ్బుకమఙ్కమాగతమపి త్యక్త్వా నిహన్తి ద్విపం
సర్వః కృచ్ఛ్రగతో ఽపి వాఞ్ఛతి జనః సత్త్వానురూపం ఫలమ్ ॥ 22

శ్లో॥ లాఙ్గూలచాలన మధశ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనం చ ।
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవస్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే ॥ 23

శ్లో॥ పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే ।
స జాతో యేన జాతేన యాతి వంశస్సమున్నతిమ్ ॥ 24

శ్లో॥ కుసుమస్తబకస్యేవ ద్వయీ వృత్తిర్మనస్వినః ।
మూర్ధ్ని వా సర్వలోకస్య శీర్యతే వన ఏవ వా ॥ 25

శ్లో॥ సన్త్యన్యేఽపి బృహస్పతిప్రభృతయ స్సమ్భావితాః పఞ్చషా
స్తాన్ప్రత్యేష విశేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే ।
ద్వావేవ గ్రసతే దివాకరనిశా ప్రాణేశ్వరౌ భాస్వరౌ
భ్రాతః పర్వణి పశ్య దానవపతిశ్శీర్షావశేషాకృతిః ॥ 26

శ్లో॥ వహతి భువన శ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం
కమఠపతినా మధ్యేపృష్ఠం సదా సచ ధార్యతే ।
త మపి కురుతే క్రోడాధీనం పయోధి రనాదరా
దహహ! మహతాం నిస్సీమానశ్చరిత్రవిభూతయః ॥ 27

శ్లో॥ వరం ప్రాణోచ్ఛేదః సమదమఘవన్ముక్తకులిశ
ప్రహారై రుద్గచ్ఛద్బహులదహనోద్గారగురుభిః ।
తుషారాద్రేః సూనోరహహ! పితరి క్లేశవివశే
న చాసౌ సంపాతః పయసి పయసాం పత్యురుచితః ॥ 28

శ్లో॥ యదచేతనోఽపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాన్తః ।
తత్తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథం సహతే ॥ 29

శ్లో॥ సింహః శిశురపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు ।
ప్రకృతి రియం సత్త్వవతాం నఖలు వయస్తేజసాం హేతుః ॥ 30

శ్లో॥ జాతిర్యాతు రసాతలం గుణగణ స్తత్రాప్యధో గచ్ఛతాత్
శీలం శైలతటాత్పతత్వభిజన స్సన్దహ్యతాం వహ్నినా ।
శౌర్యే వైరిణి వజ్రమాశు నిపతత్వర్థోఽస్తు నః కేవలం
యేనైకేన వినా గుణా స్తృణలవప్రాయా స్సమస్తా ఇమే ॥ 31

శ్లో॥ యస్యాస్తి విత్తం స నరః కులీనః న పణ్డిత స్స శ్రుతవాన్ గుణజ్ఞః ।
స ఏవ వక్తా సచ దర్శనీయః సర్వే గుణాః కాఞ్చన మాశ్రయన్తి ॥ 32

శ్లో॥ దౌర్మన్త్ర్యాన్నృపతి ర్వినశ్యతి, యతి స్సఙ్గా, త్సుతో లాలనా,
ద్విప్రోఽనధ్యయనా, త్కులం కుతనయా, చ్ఛీలం ఖలో పాసనాత్ ।
హ్రీర్మద్యా దనవేక్షణా దపి కృషిః, స్నేహః ప్రవాసాశ్రయా,
న్మైత్రీ చాప్రణయా, త్సమృద్ధి రనయా, త్త్యాగా త్ప్రమాదా ద్ధనమ్ ॥ 33

శ్లో॥ దానం భోగో నాశ, స్తిస్రో గతయో భవన్తి విత్తస్య ।
యోన దదాతి న భుఙ్క్తే తస్య తృతీయా గతి ర్భవతి ॥ 34

శ్లో॥ మణిశ్శాణోల్లీఢః సమరవిజయీ హేతిదళితో
మదక్షీణో నాగః శరది సరిదాశ్యానపులినా ।
కలాశేషశ్చన్ద్రః సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభన్తే గళితవిభవాశ్చార్థిషు నరాః ॥ 35

శ్లో॥ పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే
స పశ్చాత్సమ్పూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్ ।
అతశ్చానేకాన్తా గురులఘుతయాఽ ర్థేషు ధనినా
మవస్థా వస్తూని ప్రథయతి చ సంకోచయతి చ ॥ 36

శ్లో॥ రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేనాం
తేనాద్య వత్సమివ లోక మముం పుషాణ ।
తస్మింశ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః ॥ 37

శ్లో॥ సత్యాఽనృతా చ పరుషా ప్రియభాషిణీ చ
హింస్రా దయాళురపి చార్థపరా వదాన్యా ।
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమా చ
వారాఙ్గనేవ నృపనీతిరనేకరీతిః ॥ 38

శ్లో॥ ఆజ్ఞా కీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానం భోగో మిత్ర సంరక్షణం చ ।

యేషామేతే షడ్గుణా న ప్రవృత్తాః
కోఽ ర్థస్తేషాం పార్థివోపాశ్రయేణ ॥ 39

శ్లో॥ యద్ధాత్రానిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేఽ పి నితరాం మేరౌ చ నాతోఽ ధికమ్ ।
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్ ॥ 40

శ్లో॥ అకరుణత్వమకారణవిగ్రహః పరధనే పరయోషితి చ స్పృహా ।
సుజనబన్ధుజనేష్వసహిష్ణుతా ప్రకృతిసిద్ధమిదం హి దురాత్మనామ్॥ 41

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽ లంకృతోఽ పి సన్ ।
మణినా భూషితస్సర్పః కి మసౌ నభయంకరః ॥ 42

శ్లో॥ జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతశుచౌ దంభః శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునౌ విమతితా దైన్యం ప్రియాలాపిని ।
తేజస్విన్యవలిప్తతా ముఖరతా వక్తవ్యశక్తిస్థిరే
తత్కోనామగుణో భవేత్సగుణినాం యో దుర్జనైర్నాఙ్కితః ॥ 43

శ్లో॥ లోభ శ్చే దగుణేన కిం? పిశునతా యద్యస్తి కిం పాతకైః?
సత్యం చే త్తపసా చ కిం? శుచి మనో యద్యస్తి తీర్థేన కిం?
సౌజన్యం యది కిం బలేన? మహిమా యద్య స్తి కిం మణ్డనైః?
సద్విద్యా యది కిం ధనై? రపయశో యద్య స్తి కిం మృత్యునా? 44

శ్లో॥ శశీ దివసధూసరో, గళితయౌవనా కామినీ,
సరో విగతవారిజం, ముఖమనక్షరం స్వాకృతేః ।
ప్రభు ర్ధనపరాయణః, సతతదుర్గతి స్సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో, మనసి సప్తశల్యాని మే ॥ 45

శ్లో॥ న కశ్చిచ్చణ్డ కోపానా, మాత్మీయో నామ భూభుజామ్ ।
హోతారమపి జుహ్వానం, స్పృష్టో దహతి పావకః ॥ 46

శ్లో॥ మౌనాన్మూకః ప్రవచనపటు ర్వాచకో జాల్పకో వా,
ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతోఽ ప్యప్రగల్భః ।
క్షాన్త్యా భీరు, ర్యది న సహతే ప్రాయశో నాభిజాతః,
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః ॥ 47

శ్లో॥ ఉద్భాసితాఖిలఖలస్య విశృఙ్ఖలస్య
ప్రోద్గాఢవిస్మృత నిజాధమకర్మవృత్తేః ।
దైవా దవాప్తవిభవస్య గుణద్విషోఽ స్య
నీచస్య గోచరగతైః సుఖమాస్యతే కైః? ॥ 48

శ్లో॥ ఆరమ్భగుర్వీక్షయిణీక్రమేణ లఘ్వీపురావృద్ధిముపైతి పశ్చాత్ ।
దినస్య పూర్వార్ధ పరార్ధభిన్నా ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్ ॥ 49

శ్లో॥ మృగమీనసజ్జనానాం తృణజలసన్తోషవిహితవృత్తీనామ్ ।
లుబ్ధకధీవరపిశునా నిష్కారణమేవ వైరిణో జగతి ॥ 50

శ్లో॥ వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ, పరగుణే ప్రీతి ర్గురౌ నమ్రతా,
విద్యాయాం వ్యసనం, స్వయోషితి రతి, ర్లోకాపవాదాద్భయమ్ ।
భక్తిః శూలిని, శక్తి రాత్మదమనే, సంసర్గముక్తిః ఖలై,
రేతే యేషు వసన్తి నిర్మలగుణా, స్తేభ్యో నమః కుర్మ హే ॥ 51

శ్లో॥ విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా, యుధి విక్రమః ।
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్ ॥ 52

శ్లో॥ కరే శ్లాఘ్య స్త్యాగః, శిరసి గురుపాదప్రణయితా,
ముఖే సత్యా వాణీ, విజయి భుజయో ర్వీర్య మతులమ్ ।
హృది స్వచ్ఛా వృత్తిః శ్రుతమధిగతం చ శ్రవణయో,
ర్వినాఽ ప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డనమిదమ్ ॥ 53

శ్లో॥ ప్రాణాఘాతాన్నివృత్తిః పరధనహరణే సంయమః, సత్యవాక్యం,
కాలే శక్త్యా ప్రదానం, యువతిజనకథా మూకభావః, పరేషామ్ ।
తృష్ణాస్రోతో విభఙ్గో, గురుషు చ వినయః, సర్వభూతానుకమ్పా
సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధిః శ్రేయసామేష పన్థాః ॥ 54

శ్లో॥ సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పలకోమలమ్ ।
ఆపత్సు చ మహాశైలశిలాసఙ్ఘాత కర్కశమ్ ॥ 55

శ్లో॥ ప్రియా న్యాయ్యా వృత్తి ర్మలినమనుభఙ్గేఽ ప్యసుకరం
త్వసన్తో నాభ్యర్థ్యాః, సుహృదపి న యాచ్యః కృశధనః ।
విప ద్యుచ్చైర్థైర్యం, పదమనువిధేయం చ మహతాం
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్? 56

శ్లో॥ ప్రదానం ప్రచ్ఛన్నం, గృహముపగతే సంభ్రమవిధిః
ప్రియం కృత్వా మౌనం, సదసి కథనం చాప్యుపకృతేః ।
అనుత్సేకో లక్ష్మ్యాం, నిరభి భవసారాః పరకథాః
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్ ॥ 57

శ్లో॥ సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే,
ముక్తాకారతయా తదేవ నలినీపత్త్రస్థితం దృశ్యతే ।
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే,
ప్రాయేణాధమమధ్యమోత్తమజుషా మేవంవిధా వృత్తయః ॥ 58

శ్లో॥ యః ప్రీణయే త్సుచరితైః పితరం స పుత్త్రో,
య ద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్ ।
తన్మిత్త్ర మాపది సుఖే చ సమక్రియం య,
దేతత్ త్రయం జగతి పుణ్యకృతో లభన్తే ॥ 59

శ్లో॥ నమ్రత్వేనోన్నమన్తః, పరగుణకథనైః స్వాన్గుణాన్ఖ్యాపయన్తః,
స్వార్థా న్సంపాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే ।

క్షాన్త్యై వాక్షేపరూక్షాక్షరముఖరముఖా న్దుర్జనా న్దుఃఖయన్తః,
సన్త స్సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః? 60

శ్లో॥ భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవామ్బుభి ర్భూరివిలమ్బినో ఘనాః ।
అనుద్ధతా స్సత్పురుషాస్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్ ॥ 61

శ్లో॥ శ్రోత్రం శ్రుతేనైవ న కుణ్డలేన, దానేన పాణిర్నతుకఙ్కణేన ।
విభాతి కాయః కరుణాపరాణాం, పరోపకారేణ న చన్దనేన ॥ 62

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి,
చన్ద్రో వికాసయతి కైరవచక్రవాలమ్ ।
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి,
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః ॥ 63

శ్లో॥ ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే. 64

శ్లో॥ పాపా న్ని వారయతి, యోజయతే హితాయ,
గుహ్యం నిగూహతి, గుణాన్ ప్రకటీకరోతి ।
ఆపద్గతం చ న జహాతి, దదాతి కాలే;
సన్మిత్ర లక్షణ మిదం ప్రవదన్తి సన్తః ॥ 65

శ్లో॥ క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఽఖిలాః
క్షీరోత్తాప మవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః ।
గన్తుం పావక మున్మన స్తదభవద్దృష్ట్వా తు మిత్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి, సతాం మైత్రీ పునస్త్వీదృశీ ॥ 66

శ్లో॥ ఇతః స్వపితి కేశవః, కుల మిత స్తదీయద్విషా
మితశ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే ।
ఇతోఽపి బడబానలః సహ సమస్తసంవర్తకై
రహో వితత మూర్జితం భరసహం చ సిన్ధో ర్వపుః ॥ 67

శ్లో॥ జాతఃకూర్మః స ఏకః పృథుభువనభరాయార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రమ్,
సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టా న్న చాథో
బ్రహ్మాణ్డోదుమ్బరాన్తర్మశకవ దపరే జన్తవో జాతనష్టాః 68

శ్లో॥ తృష్ణాం ఛిన్ధి భజక్షమాం, జహి మదం, పాపే రతిం మా కృథాః,
సత్యం బ్రూ హ్యనుయాహి సాధుపదవీం, సేవస్వ విద్వజ్జనమ్ ।
మాన్యా న్మానయ, విద్విషోఽ ప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం,
కీ ర్తిం పాలయ, దుఃఖితే కురు దయా, మేత త్సతాం చేష్టితమ్ ॥ 69

శ్లో॥ మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయ న్తః
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియ న్తః. 70

## ధైర్య పద్ధతి

శో॥ రత్నైర్మహార్ఘేస్తుతుషుర్న దేవా, న భేజిరే భీమవిషేణ భీతిమ్ ।
సుధాం వినా న ప్రయయుర్విరామం న నిశ్చితార్థాద్విరమన్తి ధీరాః॥ 71

శ్లో॥ ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నై ర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి ॥ 72

శ్లో॥ క్వచి త్పృథ్వీశయ్యః క్వచి దపి చ పర్యఙ్కశయనః,
క్వచి చ్ఛాకాహారః, క్వచి దపి చ శాల్యోదనరుచిః ।

క్వచి త్కన్థాధారీ, క్వచి దపి చ దివ్యామ్బరధరో,
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్ ॥ 73

శ్లో॥ నిన్దన్తు నీతినిపుణా, యది వా స్తువన్తు,
లక్ష్మీః సమావిశతు, గచ్ఛతు వా యథేష్టమ్ ।
అద్యైవ వా మరణమస్తు, యుగాన్తరే వా
న్యాయ్యా త్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః ॥ 74

శ్లో॥ కాన్తాకటాక్షవిశిఖా నఖనన్తి యస్య
చిత్తం, న నిర్దహతి కోపకృశానుతాపః ।
కర్షన్తి భూరివిషయా శ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్నమిదం స ధీరః ॥ 75

శ్లో॥ కదర్థిత స్యాపి హి ధైర్యవృత్తే ర్నశక్యతే ధైర్యగుణఃప్రమార్ష్టుమ్ ।
అధోముఖ స్యాపి కృతస్యవహ్నే ర్నాధః శిఖా యాతి కదాచి దేవ॥ 76

శ్లో॥ వరం తుఙ్గా చ్ఛృఙ్గా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వా యం కాయ ః కఠినదృషదన్తే విదలితః ।
వరం న్యస్తో హస్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే
వరం వహ్నౌ పాత, స్తదపిన కృతః శీలవిలయః ॥ 77

శ్లో॥ వహ్ని స్తస్య జలాయతే, జలనిధిః కుల్యాయతే, తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే, మృగపతిః సద్యః కురఙ్గాయతే ।
వ్యాలో మాల్యగుణాయతే, విషరసః పీయూషవర్షాయతే
యస్యాఙ్గేఽ ఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి ॥ 78

శ్లో॥ ఛిన్నోఽ పి రోహతి తరుః క్షీణోఽ ప్యుపచీయతే పున శ్చన్ద్రః ।
ఇతి విమృశ న్త స్సన్త స్స న్తప్యన్తే న విప్లుతా లోకే ॥ 79

శ్లో॥ ఐశ్వర్యస్య విభూషణం సుజనతా, శౌర్యస్య వాక్సంయమో,
జ్ఞాన స్యోపశమః, శ్రుతస్య వినయో, విత్తస్య పాత్రే వ్యయః ।

అక్రోధ స్తపసః, క్షమా ప్రభవితు, ర్ధర్మస్య నిర్వ్యాజతా,
సర్వేషా మపి సర్వకారణ మిదం శీలం పరం భూషణమ్ ॥ 80

## దైవపద్ధతి

శ్లో॥ నేతా యస్య బృహస్పతిః, ప్రహరణం వజ్రం, సురాః సైనికాః
స్వర్గో దుర్గ, మనుగ్రహః ఖలు హరే, రైరావణో వారణః ।
ఇత్యాశ్చర్యబలాన్వితోఽ పి బలభి ద్భగ్నః పరైః సజ్గరే,
తద్వ్యక్తం నను దైవ మేవ శరణం ధిగ్ ధిగ్ వృథా పౌరుషమ్ ॥ 81

శ్లో॥ భగ్నాశస్య కరణ్డ పిణ్డితతనో ర్గ్లానేన్ద్రియస్య క్షుధా
కృత్వాఽఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః ।
తృప్తస్త త్పిశితేన సత్వర మసౌ తే నైవ యాతః పథా
స్వస్థాస్తిష్ఠత దైవ మేవ హిపరం వృద్ధౌ క్షయే కారణమ్ ॥ 82

శ్లో॥ యథా కన్దుక పాతే నో త్పత త్యార్యః పతన్నపి ।
తథా త్వనార్యః పతతి మృత్పిణ్డ పతనం యథా ॥ 83

శ్లో॥ ఖర్వాటో దివసేశ్వరస్య కిరణైః సంతాపితో మస్తకే
వాఞ్ఛన్దేశ మనాతపం విధివశాత్తాలస్య మూలం గతః ।
తత్రాప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః,
ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యాన్త్యాపదః ॥ 84

శ్లో॥ గజభుజఙ్గ విహఙ్గమబన్ధనం, శశిదివాకరయోర్గ్రహపీడనమ్।
మతిమతాం చ విలోక్య దరిద్రతాం విధిరహో బలవానితి మే మతిః॥ 85

శ్లో॥ సృజతి తావ దశేషగుణాకరం పురుష రత్న మలఙ్కరణం భువ।
తదపి తక్షణభఙ్గికరోతి చే, దహహ కష్టమపణ్డితతా విధేః॥ 86

శ్లో॥ అయమమృతనిధానం, నాయకోఽ ప్యోషధీనాం,
శతభిష గనుయాతః, శమ్భుమూర్ధ్నో ఽవతంసః,
విరహతి న చైనం రాజయక్ష్మా శశాఙ్కం,
హతవిధిపరిపాకః కేన వా లంఘనీయః? 87

జనుఁడు విపత్తిసౌఖ్యసదృశక్రియుఁ డాతఁడు మిత్రుఁ; డీత్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ బుణ్యము జేసినయట్టివారికిన్. 59

చ. నతులగుచున్ మహోన్నతిఁ దనర్చుచు, నవ్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచున్ బరజనప్రియకార్యసమర్థతన్ సమం
చిత నిజకార్యసంగ్రహముఁ జేయుచు, నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం, బరఁగు ధీరులు పూజ్యులు గారె యేరికిన్? 60

## పరోపకార పద్ధతి

తే. తరువు లతిరసఫలభార గురుతఁ గాంచు,
నింగి వ్రేలుచు నమృత, మొసంగు మేఘుఁ,
దుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత;
జగతి నుపకర్తలకు నిది సహజగుణము. 61

తే. అమరుఁ జెవి శాస్త్రమునఁ, గుండలమునఁ గాదు;
వలయమున నొప్పు, దీవిచే వెలయుఁ బాణి;
యురుదయాఢ్యులమేను పరోపకార
కలన రాణించు; గంధంబు వలనఁ గాదు. 62

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ,
గుముదహర్షంబు గావించు నమృతసూతి,
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు;
సజ్జనులు దారె పరహితాచరణమతులు. 63

మ. తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెడు వారలెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్? 64

తే. అఘమువలన మరల్చు, హితార్థకలితుఁ
జేయు, గోప్యంబు దాఁచుఁ, బోషించు గుణము,
విడువఁ డాపన్ను, లేవడి వేళ నిచ్చు;
మిత్రుఁ డీ లక్షణంబుల మెలఁగుచుండు. 65

చ. క్షీరము మున్ను నీటికొసఁగెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్,
క్షీరము దప్త మౌట గని చిచ్చుఁటికెన్ వెతచే జలంబు, దు
ర్వారసుహృద్విపత్తిఁ గని వహ్నిఁజొరం జనె దుగ్ధ, మంతలో
నీరముఁ గూడి శాంత మగు, నిల్చు మహాత్ములమైత్రి యీగతిన్. 66

చ. ఒకయెడఁ బవ్వళించు హరి, యొక్క యెడన్ వసియించు రాక్షస
ప్రకరము, లొక్కచో నడఁగు బర్వతసంఘము, లొక్కెడన్ బలా
హకములతోడ నుండు బడబాగ్నియు, విస్తృత మూర్ఛితంబునుం
బ్రకటభరక్షమంబగుచు భాసిలు నౌర సముద్ర మెంతయున్. 67

చ. వితతజగద్భరంబు దన వీఁపునఁ దాల్చిన కూర్మనాథుఁడున్,
సతతము చంద్రభాస్కరుల చక్రముఁ ద్రిప్పు ధ్రువుండు సజ్జనుల్;
ప్రతిభ నజాండజంతుఫల రంధ్రవసన్మశకంబులట్ల నిం
దితవిఫలార్థసంగతి జనించి నశించుఁ దదన్యజంతువుల్. 68

శా. ఆశాసంహరణంబు, నోర్మియు, మదత్యాగంబు, దుర్దోషవాం
ఛాశూన్యత్వము, సత్యమున్, బుధమతాచారంబు, సత్సేవయున్,
వైశద్యంబును, శత్రులాలనము, మాన్య ప్రీతియుం, బ్రశ్రయ
శ్రీశాలిత్వము, దీనులందుఁ గృపయున్, శిష్టాలికిన్ ధర్మముల్. 69

చ. హృదయవచశ్శరీరముల నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబుల గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తు లగు మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్. 70

## ధైర్యపద్ధతి

తే. తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత?
వెఱచిరే ఘోరకాకోల విషముచేత?
విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక?
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు. 71

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై,
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్,
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహు లై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్. 72

మ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుఁ బూసెజ్జపై,
నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,
బొకచో బొంత ధరించు నొక్కొక తఱిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకురానీయడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్. 73

శా. నీతి ప్రౌఢవిహారు లైననిపుణుల్ నిందంపనీ మెచ్చనీ,
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ,
ఘాతం బప్పుడ పొందనీ నియతిమైఁ గానీ యుగాంతంబునన్,
నీతిశ్లాఘ్యపదంబు దప్పరు గదా నిత్యంబు ధీరోత్తముల్. 74

ఉ. మానవతీకటాక్షశిత మార్గణముల్ విదలింపఁ జాల వె
వ్వానిమనంబు, కోపమయ వహ్ని దహింపదు, లోభపాశ సం
తానముమాల్యచందన వితానములున్ వెత సేయ నోప కె
వ్వానివశంబునన్ మెలఁగు, వాఁడు జయించు జగంబు లన్నియున్. 75

తే. నియతిచేతఁ గదర్థితుం డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మాన్పంగఁ దరమె?
క్రింద సేయంగఁబడినట్టి కృష్ణపథుని
కీల యెందైన మీఁదుగాఁ గెరలుఁ గాదె! 76

చ. ఉరుతరపర్వతాగ్రమున నుండి దృఢం బగుజాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హతంబుగఁ జేయుట మేలు, గాలిమే
పరిదొరవాతఁ గే లిడుట బాగు, హుతాశనమధ్యపాతమున్
వరమగుఁ, జారుశీలగుణ వర్జన మర్హము గాదు చూడఁగన్ 77

చ. అతనికి వార్ధి కుల్య యగు, నగ్ని జలం బగు, మేరుశైల మం
చితశిలలీల నుండు, మదసింహము జింకతెఱంగుఁ దాల్చుఁ, గో
పితఫణి పూలదండ యగు భీష్మవిషంబు సుధారసం బగున్,
క్షితి జనసమ్మతం బగుసుశీల మ దెవ్వనియందు శోభిలున్. 78

తే. ఖండితం బయ్యు భూజంబు వెండి మొలచు,
క్షీణుఁ డయ్యును నభివృద్ధి జెందు సోముఁ,
డెడఁద దీని విచారించి యొడలు దెగిన
జనములకుఁ దాప మొందరు సాధుజనులు. 79

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జనభావము, శౌర్యలక్ష్మికిన్
మౌనము, నీతి విద్యకు, శమంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము, దాల్మి శక్తికిని, ధర్మనిరూఢి కదంభవృత్తియుం,
బూనికతోడ సర్వగుణభూషణ మెన్నఁగ శీలమే సుమీ. 80

## దైవపద్ధతి

చ. గురుఁడు గురుండు, వాలు శతకోటి సుపర్వులు వాహినీపతుల్,
సురభవనంబుకోట, మధుసూదనుఁడున్ సయిదోడు, దంతి ది
క్కరిపతి గాఁగ నొప్పు బలభూతియు దాయల కోడె నాజిలో;
శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్ని భంగులన్. 81

ఉ. రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సిన పామువాత సం
పాతముఁ జెందె, దానిఁ దినిపాము దొలంగె బిలంబు త్రోవనే;
యేతతి హానివృద్ధులకు నెక్కటి దైవమ కారణం బగున్. 82

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందం బడి మగుడ మీఁది కి న్నెగయుఁ జుమీ,
మందుఁడు మృత్పిండమువలెఁ
గ్రిందం బడి యడఁగి యుండుఁ గృపణత్వమునన్. 83

మ. ధర ఖర్వాటుఁ డొకండు సూర్యకర సంతప్తప్రధానాంగుఁడై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁ, ద
చ్ఛిరమున్ దత్ఫలపాత వేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ,
బొరి దైవోపహతుండు వోవుకడకుం బోవుంగదా యాపదల్. 84

తే. ఫణులు గజములుఁ బక్షులుఁ బట్టువడుట,
రవిసుధాకరులకు నైన రాహు బాధ,
బుద్ధిమంతుల లేమియుఁ, బొసఁగఁ జూచి
విధి బలాఢ్యుఁ డటంచు భావింతు మదిని. 85

క. గుణమణిఖని యగు పూరుష మణి ధరణికి రవణముగ న మర్చినవిధి యా
గుణవంతుని వెసఁ దునిమిన గుణహీనునిఁ గాఁగ నెన్ను కొనరే ధాతన్. 86

చ. శతభిషగాఢ్యుఁడున్ సతత శంభువతంసము నయ్యు, నోషదీ
తతులకు నాథుఁ డయ్యును, సుధారససేవధి యయ్యుఁ, దారకా
పతి దనరాజయక్ష్మభవ బాధలఁ బాపఁగనోపఁ డక్కటా!
హతవిధికృత్య మెవ్వనికి నైన జగంబున దాఁటవచ్చునే! 87

చ. కలితవిపత్తిదండపదఘట్టనసేయుచు మన్నుకైవడిన్
ఖలుఁడు విధాత పిండితముగా నొనరించి నితాంతచింతయన్
బలితపుసారెపై నిలిపి పాయక డెందము ద్రిప్పుచున్న వాఁ
డలమి కులాలురీతిఁ దెలియం గలవారమే యేమిసేయునో? 88

చ. దొసఁగులు వచ్చు వేళ గుణధుర్యుల ధైర్యగుణంబు సర్వముం
బస చెడు నంచుఁ జూచెదవు పాపపుదైవమ, యీ దురాగ్రహ

వ్యసనము మాను, మాను ప్రళయంబున వీతనిజక్రమంబులై
సపి సెడ వించుకంతయును సాగరముల్ గులపర్వతంబులున్. 89

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము
దైవకృత మగునది వొందుఁ దప్ప కతనిఁ,
గారణము గాదు పెనుఁబ్రాపు ఘనునిఁ జేరు
చాతకమువాతఁబడు నల్ప జలకణములు. 90

## కర్మపద్ధతి

చ. శిథిలత లేనిభక్తి నతి సేయుదు వేల్పుల, కా సుపర్వులున్
విధివశవర్తు, లావిధియు విశ్రుత కర్మఫలప్రదాత, య
య్యధిక ఫలంబు కర్మవశ, మట్లగుటం బనియేమి వారిచే?
విధి కధికంబు గర్మమని వేమఱు మ్రొక్కి భజింతుఁ గర్మమున్. 91

చ. నలువ కులాలు భంగి నలినప్రభవాండమునందు దేనిచే
నిలిచె, దశావతారావననిష్ఠితుఁ డయ్యె మురారి దేనిచేఁ,
బెలుచఁ గపాలహస్తుఁ డయి భిక్షకుఁ డయ్యెఁ బురారి దేనిచే,
నల రవి దేనిచేఁ దిరుగు, నా ఘనకర్మము వంద్యమే కదా. 92

మ. ఖలునిన్ సజ్జనుఁ గాఁగ, మూర్ఖజను సంఖ్యావంతునింగాఁగ, దా
యల సన్మిత్రులఁగా, నగోచరముఁ బ్రత్యక్షంబుగాఁ, బ్రాణహృ
త్కలనం బైన మహావిషంబమృతముంగాఁ, జేయు సత్కర్మ ము
జ్జ్వల నిష్ఠానిధివై భజింపుము వయస్యా వాంఛితార్థాప్తికిన్. 93

చ. లలిత నికేతన ప్రియ విలాసవతీ ధవళాతపత్ర స
ద్విలసితవైభవం బనుభవింపడున్ సుకృతానువృత్తిచేఁ,
జెలువగు పుణ్యకర్మము నశించిన నంగజసంగరత్రుట
త్కలితగుణోరుమౌక్తిక నికాయములట్లు దొలంగు సంపదల్. 94

తే. సగుణ నిర్గుణ కార్యముల్ సలుపు సుమతి
సేఁతపరిణతిఁ గడుఁ బ్రతీక్షింపఁ దగును,
బరుషకర్మవిపాకంబు ఫలము దనుక
హృదయము దహించు శల్యంబు రీతి జగతి. 95

మ. చెలువౌ రత్నఘటంబునం దతఁడు సుశ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె, నాగరుల కర్థిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్, జిల్లెడుదూదికై పుడమి దున్నెన్ బైఁడినాఁగేళ్ళ, ని
మ్ములఁగర్మక్షితిఁబుట్టి యెవ్వఁడు దపంబుల్ సేయ ఁడప్రాజ్ఞతన్. 96

తే. రమ్యరూపంబు విద్యయు రాజసేవ
కులము శీలంబుఁ జాలవు ఫలమొసంగఁ;
బూర్వపుణ్యసంచితభాగ్యములు ఫలించుఁ
గాలమునఁ బనసాది వృక్షముల కరణి. 97

చ. సలిలముఁ జొచ్చినం, గనక శైలముఁ జేరిన, వైరివీరులం
గెలిచిన, రాజసేవఁ దిలకించిన, వేదము లభ్యసించినం,
గళల తెఱం గెఱింగిన, ఖగత్వము దాల్చినఁ గర్మనిష్మ్నతా
కలన నభావ్య మైన పని గాదు వినాశము లేదు భావికిన్. 98

క. కాననమున రణమున సలి, లానలరిపుమధ్యమున మహాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తునిద్రితుఁ, బూనికతోఁ బూర్వపుణ్యములు రక్షించున్. 99

తే. భువనమునఁ బూర్వసంభృత పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన సుగుణనిధికి
వనము పుర మగుఁ, బరు లాత్మజనము లగుదు,
రవని నిధిరత్న పరిపూర్ణమయి ఫలించు, 100



# శృంగార శతకము

ఉ. శంకరపద్మగర్భ మురశాసనులన్ భువనేశులన్ నిరా
తంకధృతిన్ మృగాక్షులకు దాసులఁ జేసిన మేటికిం గురం
గాంకవసంతమిత్రునకు నంజలిఁ జేసెద వాగతీత ని
శ్శంక చరిత్రచిత్రునకు షడ్గుణహారికి శంబరారికిన్. 1

చ. చెలువపుఁ దేట లేనగవు చేతను భావముచేత సిగ్గుచే
నలువగులీలచేత సుగుణంబులచేఁ గడగంటి చూపుచేఁ
గలహముచేత విందులగు కందువమాటలచే నసూయచేఁ
బెలుచన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్. 2

తే. భ్రూలతాక్షేపకుంచిత స్ఫురణఁదాల్చు
కలికిచూపులు నెయ్యంపుఁ బలుకుఁదీపు
సిగ్గునగవులు చెన్నగు చిన్నినడలు
సొమ్ము లాయుధములు ముద్దుగుమ్మలకును. 3

ఉ. భ్రూలతికావిభంగయుతముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేలవిలాసముల్ మదనదీపనముల్ రుచిరంబులైన కాం
తాలసమాననేత్రవలితంబులచే దిశలెల్ల విస్ఫుర
న్నీలసరోజపత్రములు నిండె ననం గనుపట్టె నెంతయున్. 4

ఉ. తమ్ముల నేలు కన్నులు, సుధానిధిఁ బోలుమొగంబు, మత్తభృం
గమ్ముల గెల్చుకొప్పు, కనకద్యుతి మీఱుమెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వు గుబ్బ చనుబంతులు, గొప్పపిఱుందు, తేనియల్
చిమ్మెడుముద్దుఁ బల్కులును, జేయనిసొమ్ములు సుందరాంగికిన్. 5

ఉ. ఇంచుకముద్దు లేనగవు, లింపగునవ్యవిలాససూక్తు, ల
భ్యంచితలోలదృష్టియు, నవారుణపల్లవమండలంబు ని

ర్మించు సలీలయానములు, మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించుమృగాక్షిచందము లతిప్రమదంబు ఘటింపఁజాలవే. 6

సీ॥ చూడంగ దగిన వస్తువులందు ఘనమెద్ది, తులలేక తగు వెలందుల మొగంబు
వలపు గైకొనదగు వానిలో నెయ్యది మగువల వదనాబ్జమారుతంబు
వీనుల కింపైన వానియందెయ్యది కోమలాంగుల ముద్దు కులుకు పలుకు
తనువు సోకిన సుఖంబొనరించు నెయ్యది మెలతల సొబగైన మేనుదీవ

తే.గీ. యతిమధుర మెద్ది? కాంతాధరామృతంబు;
సరసజనులకుఁ జింతింపఁ జాలు నెద్ది?
పువ్వుఁ బోదుల వెలలేని జవ్వనంబు;
వెలయు నెల్లడఁ బడఁతుల విభ్రమములు. 7

మ. కరచంచన్మణికంకణక్వణరణత్కాంచీగుణస్వర్ణ నూ
పురనాదాహృతరాజహంసరమణుల్ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ముగ్ధత్రస్తవల్గన్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగంతస్తోమపాతంబులన్. 8

చ. గొనబగుమేన సంకుమదకుంకుమపంక మెసంగఁ, సిబ్బెపుం
జనుగవ రత్నహారములు సారెఁ బెనంగఁ, బదాంబుజంబులన్
మొనసినగిల్కు టందియల మ్రోఁత చెలంగ, ననంగవైభవం
బెనయఁగఁ గుల్కు కల్కి సొబగెవ్వనిఁ దా వలపింప దిమ్మహిన్. 9

చ. అతివలఁ జూచి వీ రబల లంచు వచించు మహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు, లిది దబ్బర గాదు; విలాసినీ సమం
చితతరళాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులున్;
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచి చూడఁగన్? 10

క. నారీజనముల కాజ్ఞా కారి యగు భటుండు మరుఁడు గాఁబోలుఁ జుమీ
వారికటాక్షము సోఁకిన వారియెడన వాఁడిఁ జూపి వర్తించుఁగదా. 11

ఉ. వావిరిఁ గన్నుదోయిశ్రుతి పారగ, మెంతయు సంయముల్ కురుల్,
భావశుచి ద్విజప్రకర భాజన మెన్న ముఖాంతరంబు, ము
క్తావళిరమ్యముల్ కుచము లక్కట యిట్లు ప్రశాంతమయ్యు రా
జీవదళాక్షి మేను విరచించుచు నున్నది మాకు రాగమున్. 12

క. శరములచే భేదింపక, నిరతముఁజేసెదవు హృదయ నిర్భేదము భా
సురగుణములచే నద్భుత, కరచాపప్రౌఢి నీకె కలదు లతాంగీ. 13

ఆ. పెక్కుదివియు లున్న జక్కవచెలి యున్న రిక్క రాయఁడున్నఁ జుక్క లున్నఁ
జిన్ని లేడిచూపు చేడియ నెడఁబాయు నప్పు దంధకార మయ్యె జగము. 14

చ. గరువపుఁజన్నులుం, బెళుకు గన్నులు, నిల్కడలేని కన్బొమల్;
మురియుచు నెఱ్ఱవాఱుజిగి మోవియుఁ దాపముఁ జేయఁగాఁ దగున్,
స్మరలిఖితోరుభాగ్యలిపి జాల మనం దగి మధ్యవర్తియై
పరఁగిన రోమరాజియును బాయక తాపముఁ జేయ న్యాయమే? 15

తే.గీ. మిగుల శశికాంతమైన నెమ్మొగముచేత
నెఱి మహీనీలరుచు లైన నెఱులచేత
జలజరాగము లయిన హ స్తములచేత
రత్నమయ మనఁ గామినీ రత్న మమరె. 16

క. గురు వగు కుచభారంబును
సరసకళాభాస్వదాస్య చంద్రుండు శనై
శ్చరము లగు చరణములుఁ గల
కరిగమన దనర్చె నౌరఁ గ్రహరూపయనన్. 17

చ. సుదతిపయోధరంబు లతి సుందరముల్ జఘనంబు రమ్య, మా
వదనము హృద్య మంచు జలవర్తన మేటికి నీకు జిత్తమా?
కదలక వానిపైఁ దలపుఁ గల్గినఁ బున్నెము లాచరింపు; మిం
పొదవ లభించునే సుకృతయోగము లేక సమీహితార్థముల్? 18

చ. కనఁదగు నిండుజవ్వనపుఁ గల్మికిఁ దావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు పుష్పధనుర్జయ దానదక్ష వా
ఙ్మనసిజచిత్తహారులు, వికారనిదానము, లైన కామినీ
జనుల విలాసకృత్యములు సంతత రమ్యతరంబు లెన్నఁగన్. 19

మ. ప్రణయశ్రీమధురంబు లజ్జ్వలరసప్రాచుర్యముల్ ప్రేమ భూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిరవిశ్వాసార్ద్రముల్ ముగ్ధముల్
ఫణితిశ్రావ్యము లంగజప్రభవముల్ ప్రాణేశ్వరీ నర్మ భా
షణముల్ నామదిఁ గొల్లలాడెడి రహస్యక్రీడలం దెప్పుడున్. 20

## సంభోగ వర్ణనము

చ. విరహకృశాంగియైన ఘనవేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచితంబుగ మాటికి విశ్రమించి బం
ధురగతి సంచరించెఁ జనుదోయిని బయ్యెదకొంగుఁ గేలఁ దా
వెరవుగఁ బూని యగ్గలపు వెన్నెలకాఁకఁ దొలంగఁ జేయుచున్. 21

ఉ. బాలిక నన్నుఁ గన్గొనని పట్టున దర్శన మాత్ర మబ్బినం
జాలు నటంచుఁ గోరె మఱి చక్కఁగఁ గన్నుల నన్నుఁ జూచిప్రో
యాలు కవుంగిలింపవలె నంచుఁ దలంచెఁ దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న నిరు మేనులు నొక్కటి సేయఁ గోరితిన్. 22

చ. తలపయి మాలతీకుసుమదామము, నెమ్మొయిఁ గుంకుమంబుతోఁ
గలసినకమ్మతావి విరి గంధపుఁబూత, వెడంద ఱొమ్మునం
దలికులనీలకుంతల మదాలస నీలసరోరుహాక్షియుం,
గలుగుట నింద్రభోగ మనఁ గాఁదగదే? మఱివేఱె యున్నదే? 23

ఉ. ఆది మితాదరంబు, తదనంతర మంచిత రాగ, మంత ల
జ్జోదయరమ్య, మంత శిథిలోద్యమ, మంత నితాంతధైర్య వి

చ్ఛేదము, ప్రేమపూరము విశేషవివిక్తవిహార, మంత నా
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే? 24

ఉ. అక్కున వ్రాలి, కొప్పు విడి యల్లలనాడగ, గన్ను దామరల్
చక్కఁగ మోడ్చి, చొక్కి, పురుషాయితసంజనితశ్రమంబునం
జెక్కుల ఘర్మబిందువులు చిందఁగ, విందొనరించుబోంట్లమే
ల్చొక్కపుమోవితేనె చవిఁ జూతురు భాగ్యముఁ గల్గు నేర్పరుల్. 25

తే. కన్ను లరమోడ్చి విహరించు చున్న వారి
సురతభోగంబు తెల్వితోఁ బరఁగెనేని
రమ్య మగునిది కామనిర్వహణ; మనుచు
నాయికానాయకులకు నిర్ణయముగాదె. 26

చ. ఇది యుచితంబు గానిపని యిమ్మహిలో మగవారి కెంతయున్
మదనసుఖాభిలాషములు మానక యున్కి జరాభరంబునం,
గొదమమిటారిముద్దుచనుగుబ్బలు జాతినవెన్క బోంట్లకున్
మదనసుఖంబు జీవితము మాన్పఁడు తామరచూలి జాణయే? 27

శా. అశాసాగరపార మేరికిని శక్యం బౌనె చేరంగ? భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం బైనన్ ధనం బేల? ధా
త్రీశా! యింటికిఁ బోదుమే ప్రియవధూహృద్యోల్లసద్రూప రే
ఖాశోభాతిశయంబు దుర్భరజరాక్రాంతంబు గాకుండఁ గన్. 28

చ. రతిపతిచేతివాలు ఘనరాగనివాసము నీతివైరి దు
ర్గతిశతదుఃఖమోహజని కారణ ముజ్జ్వలబోధతారకా
పతి నిబిడాభ్రబృందము శుభప్రతిబంధము దోషసంఘ సం
గత మగు సేగి జవ్వనము కన్న జగంబున వేఱె యున్నదే? 29

ఉ. మారునికూర్మిచట్టము సమంచిత కేళిరసహ్రదంబు, శృం
గారమహీజ నీరదము, కంజముఖీజన దృక్చకోరరా

కారజనీశమండలము, కాంచవచోమణివార్ధి, యౌవనం
బారయఁ జెందుచో వికృతి నందనివాఁడె కృతార్థుఁ డిమ్మహిన్. 30

చ. జలజవిలోచనంబులును సన్నపుఁజందుర కావిచీరెలుం
గులుకు మెఱుంగుఁజన్నులును గొంచెపుఁగౌనులు రత్నకింకిణీ
కలరశనాగుణంబులును గల్గిన కాంతలు గల్గరేని గా
సిలి మతిమంతు లేటికి వసింతురు రాజగృహాంగణంబులన్? 31

శా. గంగాధౌతశిలాతలంబు హరగోస్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధసేవితగుహాస్తోమంబు శీతాచలో
త్సంగం బుండఁగ నెవ్వఁడోపు నృపపాదంబుల్ దలందాల్ప సా
రంగీశాబవిలోచనల్ మనసిజాస్త్రంబుల్ సతుల్ లేనిచోన్? 32

తే.గీ. అమితసంసార! నీదుపర్యంతపదవి గతి దలంప దవీయసి గాదు సూవె,
యర్థికీలోనఁ గడవంగ నలవిగాని ఖంజరీటాయతాక్షులు గలుగ రేని. 33

చ. శిలమొన మూలముల్ చిదిమి చెన్నుగ వేణుకరీర కాంతిచే
లలితము లైన దర్భకబళంబులు లేళ్ళకు నిమ్ము కానలోఁ,
గలిత శకాంగనా విపులగండవిపాండుర నాగవల్లికా
దళముల గోళ్ళఁ ద్రుంచి వనితాతతి కైన నొసంగు మిమ్ములన్. 34

చ. దురితనిదానముల్ సకల దోషగృహంబులు సారహీనముల్
పరిణతి ఘోరముల్ విషయ పద్ధతు లెంతయుఁ గుత్సితంబు; లి
ద్ధరను బరోపకార సుకృతంబును బోలవు పుణ్యముల్, మనో
హరతర వస్తువుల్ కువలయాక్షుల కన్నను గల్గ వెవ్వియున్. 35

ఉ. ఆరయ మత్సరంబు విడనాడి సమంచిత కార్యనిశ్చయో
దారవిచారులై సరస తన్వచియింతురు గాక సజ్జనుల్,
ధారుణి సేవ్యముల్ గిరిని తంబములో మఱి కాక మన్మథ
స్మేరవిలాసినీజన విశేషనితంబములో తలంపఁగన్. 36

శా. సారం బెక్కడలేక మిథ్య యగు సంసారంబునన్ మార్గముల్
బాఱం జూచిన రెండు పండితులకున్ బ్రహ్మానుసంధాన యో
గారూఢత్వము రూపవద్యువతి రమ్యస్థూల మీనధ్వజా
గారన్యస్త కరారవిందకృతయోగ్యస్పర్శలీలాప్తియున్. 37

తే.గీ. అఖిలపాతకభయహారి యైన గాంగ
వారియందైన యువమనోహారి యగుచు
హారి యగు కల్కికుల్కు మిటారిచన్ను
దోయియందైన వాసంబు సేయవలయు. 38

చ. కనుఁగొన యుక్తియుక్తములు కానివి మాటలు వేయు నేటికిన్?
గొనబుగ రెండు మానవులకున్ భజనార్హములైన వస్తువుల్
వినుతనవీనచారుమదవిభ్రమ లాలస సుందరీజన
స్తనభరఖిన్నమై యమరు యౌవనమున్ వనమున్ వసుంధరన్. 39

తే.గీ. తథ్యమ వచింతుఁ బక్షపాతమున గాదు,
నిఖిలజగములయం దిది నిక్కువంబు,
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు,
వారలే కష్టముల కెల్లఁ గారణములు. 40

## కామినీ గర్హణము

మ. మలభూయిష్ఠపుఁ దోలుబొమ్మయగుకొమ్మం జూచి విద్వాంసుడుం
బులినశ్రోణి మనోహరస్తని నవాంభోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వి యటంచు మత్తుఁడగు, హర్షించున్, రమించున్, బళీ
బళియంచున్ వినుతించు; మోహవికృతుల్ భావింపగా జిత్రముల్. 41

క. తనుఁ దలచినఁ బరితాపముఁ
గనుఁగొనఁ జిత్తభ్రమంబుఁ, గదువేడుక ము
ట్టిన మోహంబు నొసంగెడు
వనిత దయిత యనుచుఁ బలుక వచ్చునె జగతిన్? 42

తే.గీ. ఎంతలో నింతి కన్నులఁ యెదుట నిలుచు
నంతలో నింపు వాటించు నమృతమట్ల,
కాక లోచనమార్గంబుఁ గడచెనేని
గరళమునకన్నఁ బ్రాణసంకటముఁ జేయు. 43

ఆ. పడఁతి నొక్కదాని విడిచి యించుక యమృ
తంబు లేదు భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగవతి యైనఁ
గాక మెలఁగెనేని గరళవల్లి. 44

మ. నరక ద్వారము, సాహసాకరము, పుణ్యస్వర్గ విఘ్నంబు, దు
స్తరమాయాశతపేటి, దంభనిధి, దోషస్థాన, మప్రత్యయో
త్కరసుక్షేత్రము, కాలకూటమమృతాకారంబు, స్త్రీయంత్రమున్
ధర నెవ్వాడుఁ సృజించె బూరుష గళోద్బంధక్రియాపాశమున్? 45

చ. అల నెల కామినీ వదన మై జనియింపగ లేదు, కల్వలున్
నెలఁతకుఁ గన్నులై యునికి నిక్కము గాదు, కడానిచే నొడల్
వలనుగఁ జేయ లేదు; కవి వంచితమానసుఁడై వివేకియున్
మలమలినాంగనాతను సమాశ్రయుఁడై విహరించు మందతన్. 46

తే.గీ. లలిత మైనట్టిలీల లీలావతులకు
సహజ మది మూఢునకు మది సందడించుఁ,
బద్మినికి రాగగరిమ స్వాభావికంబు,
తేఁటి పనిలేక దానిలోఁ దిరుగుచుండు. 47

శా. రాకాకైరవమిత్రకాంతిహరమై రమ్యాధరోష్ఠామృతా
స్తోకంబై విలసిల్లుచున్న రమణీ శుంభన్ముఖాబ్జంబు కిం
పాకక్ష్మాజఫలం బగున్ రుచిరమై ప్రారంభకాలంబునం
గాకోలంబు తెఱంగునన్ నరులకుం గష్టం బొసంగుం దుదిన్. 48

ఉ. చన్నులు చక్రవాకములు, చక్కనిమోముఁ గరంబు లబ్జముల్,
గన్నులు మీలు, నాభి సుడి గాఢనితంబము సైకతంబుగా,
నెన్నికఁ గన్న బోటి యనుఁ నేటికి దవ్వుల నున్కి చాల మే
లెన్న భవాబ్ధిమజ్జన మదేమియుఁ గోరనివారి కిమ్మహిన్. 49

తే.గీ. ఒకనితోఁ గూడి భాషింతు, రొక్కనరుని
జూతురు విలాససంపద సొంపు గులుక,
మఱియు నొక్కనిఁ దలతురు మనసులోన,
గూర్చు ప్రియుఁ డెవ్వఁడో ముద్దుగుమ్మలకును? 50

ఉ. చూపు విషంబు, విభ్రమము సొంపు ఫణాఫలకంబుగా వధూ
రూపము దాల్చు భోగికిని, రూఢిగ దూరముగాఁ దొలంగుమీ,
దాపుగ సర్పదష్టునకుఁ దప్పు విషంబు మహౌషధంబులం,
బాప వధూభుజంగవిషభగ్నునిచెంతకుఁ బోరు మాంత్రికుల్. 51

ఉ. చేరి మనోజధీవరుని చేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూని యున్న పెనుగాలము చిమ్మఁగ నయ్యో, దానిచే
భీరుజనాధరామిషముఁ బేర్మి భుజించు నరాండజంబులన్
వారక సారెకుం దిగిచి వండు మరుం డనురాగవహ్నిలోన్. 52

క. స్తనపర్వతదుర్గమమై ఘనమగుకాంతాశరీర కాంతారమునం
జనఁ బోకు మనఃపాంథుడ! కనలుచు మరుఁ డనెడిదొంగ గలఁ డచ్చోటన్. 53

చ. ఉరగము ముట్టెనా నరుల కుర్విని వెజ్జులు ధర్మశీలు రై
గరళము నెక్కుడింతు రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ బూనినమానినిచూపు సోఁ కినం
బురుషున కెందు మందులును బొందవు, పొందరు వెజ్జులెవ్వరున్. 54

ఉ. ఈమృదుగాన మీనటన మీ కుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము నింతులయందుఁ దనర్చు నంచు న

న్నేమఱంజేసి యాత్మహిత మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చ హిత కార్యవిహీనుఁ డ నైతి నక్కటా! 56

ఉ. ఆరయ మంత్రగమ్యమును నౌషధసాధ్యముఁ గాదు, శాంతికా
చారశతంబులం జెడదు, చండతరభ్రమకల్పనోద్ధతిన్
భూరివికార మంగములఁ బూన్చుచు మన్మథజన్య మీ యప
స్మారము లోచనద్వయము సారెకుఁ ద్రిప్పెదు జక్రముంబలెన్. 56

చ. విడువక పుట్టుగ్రుడ్డునకు వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకుఁ జారునిజాంగము లొక్క రూకకై
కడువడి నిచ్చువారి గుణ కల్పలతల్ విదలించుకత్తులం
బడుపుఁబడంతులం దనదు భావము జేర్చునె యెవ్వఁడేనియున్? 57

క. రూపేంధనర్ధిత వేశ్యాపంచశరాగ్నికీల యందంగజ పూ
జాపరతంత్రులు వేల్తురు దాపుగఁ దమ జవ్వనములు ధనములు గడఁకన్. 58

క. జారభటచోరచేటక, చారనటప్రభృతినీచ జననిష్ఠీవా
ధారశరావము వారస్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్? 59

చ. కలదు కదా సుధారసము కంజదళాక్షులముద్దుఁ బల్కులన్,
వెలయుఁ గదా హలాహలము వీరలచిత్తమునందుఁ; గావునన్
బలుమఱుఁ బల్లవాధరముఁ బానమొనర్తురు నిండువేడుకన్
బలితపుఁబొమ్ము ముష్టితలపాతములం బ్రహరింతు రెంతయున్. 60

## సువిరక్త పద్ధతి

చ. కలకిమెఱుంగువాలుఁ, దెలిగన్నులు సన్నపు గౌను, దీఁగెపై
నలరెడు సద్వళీ లతలు, నంచితయౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడుసిబ్బెపున్వలుఁద గుబ్బలునుం, గలమించుబోండ్ల రూ
పులఁ గని నిర్వికారు లగు పూరుషులే కృతకృత్యు లిద్ధరన్. 61

ఉ. మానిని! యేల చిమ్మెదవు మాపయి మంథరదృష్టిపాతము
ల్మానుము నీ(శమంబు విఫలం బిది, వింతల మైతి మిత్తఱిన్,
మానుగ జవ్వనం బడcగె, మానసవృత్తి వనంబు గోరె, న
జ్ఞానము నష్టమయ్యె, యవసంబుగ జాచెద మెల్లలోకముల్. 62

ఉ. నీల సరోజపత్ర కమనీయవిభాహరణ(ప్రవీణ దృ
గ్జాలములీలతాంగి వెదచల్లెదు నాపయి నేమిగోరెనో
తూలె సమస్త మోహవికృతుల్ రతివల్లభభిల్లభల్ల సూ
జ్వాలలడంగె మాకుcదనవైఖరి మానదు జోటి నేటికిన్ 63

ఉ. ఓరి మనోజ! సూనశరమూరక చిమ్మకు మిన్నకే కుహూం
కాలము లేల చేసెదు పికధ్వజ యోమృగశాబకాక్షి నీ
చారువిలోకనంబు లిcకచాలును నా హృదయంబు శంకరో
దార పదాబ్జచింతన సుధారసతత్పరమయ్యె నియ్యెడన్ 64

కం. విరహమునందైనcబరస్పర మనురాగులకుcబొందు భాసిలు మనసె
వ్వరి కెనయదు వారలకును విరహము హెచ్చుగనొనర్చు వెసంగతియున్. 65

క. చన నేటికిc (బేయసి జీ
వనవతి యగునేని (ప్రాణ వతి గాని తఱిం
బని యే? యని యొక తెరువరి
చనc డింటికి సవ్యజలద సమయమునందున్ 66

మ. మన సింపొందcగ ధీరులార కరుణామై(త్రీ మనీషాక్షమా
వనితాసంగమ మాచరింపుc డెపుడున్ భామాసుఖంబస్థిరం
బని వర్జింపుcడు, హారరమ్యకుచముల్ (ప్రొంచన్మణీమేఖలా
ధ్వనితాలంబినితంబమున్ నరకబాధ ల్మాన్పి రక్షించునే? 67

చ. ఎనసినయోగమార్గరతి యెవ్వని డెందము లో వెలుంగుతోc
గొనకొని యేకమై వెలుcగుc గూరిమి మీఱcగ వాని కేటికిన్

వనితలముద్దుఁ బల్కులునుఁ వాతెఱతేనియ లూర్పుఁదావులున్
గొనబగుమోముఁ జందురులు గుబ్బలుగొఁగిటఁ జేర్చుకూటముల్ 68

చ. స్మరతిమిరప్రచారభవ శశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వధూమయ మై కననయ్యె; నిప్పు డిం
పరయఁ గ సద్వివేకమహితాంజనసంగత మై మదీయ భా
సురసమదృష్టి బ్రహ్మముఁగ జూచుచు నున్నది విశ్వమంతయున్ 69

క. నీలోత్పలనయనా తరళాలోకనహతులు సోఁకు నంతకు వెలుఁగున్
ధీ లలితసుజనవిమలోద్వేలాతిస్ఫుటవివేక దీపము నెమ్మిన్ 70

చ. నిగమసుభాషితాభ్యసన నిష్ఠలు గల్గినయట్టిపండితుల్
మగువలపొందు నింద్య మని మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్;
జగమున నెవ్వఁడోపు విలసత్కురువిన్దమణిప్రభా ధగ
ద్ధగిత కలాప రమ్యవనితాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్ 71

తే.గీ. కుటిలవాదియుఁ బరవంచకుండు వాఁడు
నెమ్మి నెవ్వాఁడు యువతుల నిందసేయు,
నింద్రలోకము తపముల కెల్ల ఫలము
స్వర్గమున నున్నవార లచ్చరలు గారె? 72

తే.గీ. సమదకుంజరకుంభ భంజనులు మఱియు
నుగ్రమృగరాజవధదక్షు లుర్వి గలరు;
తఱచుగా లేరు కందర్ప దర్పదళన
నిపుణజను లని చాటింతు నిఖిలసభల 73

శా. సారాచారముఁ బూను, నింద్రియములన్ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ బ్రశాంతిఁ జేకొను నరుండందాఁక; నెందాఁక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు నుదారభ్రూధనుర్ముక్తమున్
నారీవీక్షణబాణముల్ చొరవు విన్నాణంబుగా డెందమున్ 74

క. ప్రేమావేశభరంబునభామాజను లాచరించు పని మరలింపం
దామరవిరిలో cబొడమినయా మేటికి నైన నలవి యగునె తలంపన్? 75

క. కులశీలవివేకంబులుదొలcగక నరులందు నిల్చు దుర్భరమదన
జ్వలనము సర్వాంగంబులనెలకొననందాcక; నంత నిలువం గలవే? 76

తే. శాస్త్రవిదుcడైన బుధుcడైన సదయుcడైన
సద్గతికి బోవు టరిది సంసారసరణి,
యమపురద్వారముల కవాటములc గుంచి
కలునుబలె విప్పుచున్నవి కలికిబొమలు 77

చ. కరము కృశించి కాల్ విఱిగి కన్నులు గానక పుచ్ఛహీనమై
పురుగులు గ్రమ్ముచున్న వ్రణపుంజము మే నలమంగ నాcకటం
బరవశ మై ఘటీముఖకపాలగళం బగు కుక్క పెంటితో
నరిగెడుc గూళ జంతువుల నైన వధించు మనోజుc డక్కటా! 78

చ. స్మరునకు సర్వలోకజయసంపద లీయcగc జాలు ప్రౌఢలం
దరుణుల నిందసేయుట సధర్ములు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుc గపాలకపాణులు దండహస్తులై
తిరుగుచు నున్నవారు; రతిదేవుని మీఱిన భోగ మబ్బునే? 79

చ. వనదళవాతముల్ మెసపు వారు పరాశరకౌశికాదు; లా
ఘనులును సుందరీజనులc గన్గొని మోహితచిత్తులైరి; హె
చ్చిన ఘృతపాయస్నానము భుజించెడివారలకున్ మనోజయం
బు నెగడు నేని వింధ్యము సముద్రజలంబులc దేలియాడదే? 80

## ఋతువర్ణన పద్ధతి

చ. వలపువహించె గంధగిరి వాతపరంపర, భూరిభూజ శా
ఖలు చిగిరించె, నిం పెసcగెc గాకలి కోకిలలందుc, జెక్కులం
బలుచని ఘర్మబిందువులు భామలకుం బ్రసరించె; నెయ్యడం
జెలువు ఘటింపc జాలదు విశేcష వసంతసమాగమం బిలన్ 81

తే. నిండుకొని వచ్చుగందపుఁ గొండ చల్ల
గాలియును బిక కాకలికారవంబు
విరహిజనుల వధించె నవ్వేళఁ గాన
నమృతమును విష మగు విపత్ప్రాప్తియందు 82

చ. ఘనకిలికించితప్రచుర కాంతలు చెంతఁ బికాంగనా కల
స్వనములు వీనులందు, సుమశాలినికుంజము , పుష్పమాల్యముల్;
వినుతకవిప్రసంగమును వెన్నెల తేటలు, భాగ్యవంతు లౌ
జనులకుఁ జైత్రమాసమున సౌఖ్య మొనర్చు సుగంధితోయముల్. 83

చ. వరలు వియోగినీవిరహవహ్నికి నాహుతిలీలఁ బొల్చు భా
సురసహకారమంజరులఁ జూచి మదించెఁ బికంబు లత్తఱిన్,
సురతపరిశ్రమాతిశయసూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళభారచోరములు బంధుర చందనశైలవాతముల్ 84

తే.గీ. అంగజునిగంధసింధురం బనఁగ బరఁగు
మలయజసుగంధి మలయాద్రి మారుతంబు
మలయ దెందాఁక నందాక మానవతుల
మానసంబుల నెలకొని మాన మమరు 85

తే.గీ. సరసహకారకుసుమ కేసర సమూహ
గురుతరామోదమయదిగంతరము మధుర
మధువిధురమధుపము మధుమాసమయ
మెవ్వనికి వేడ్క వాటింప దిజ్జగమున 86

చ. అతిసితచందనార్ద్రరుచిరాంగులు భామినులున్, సుగంధసం
గతమగుమందమారుతముఁ గౌముదియున్, జలయంత్రగేహ, ము
న్నతశుచి సౌధభాగము, ఘనంబగు వాసనఁబూను పుష్పసం
తతియు, మదంబు దర్పకుని దర్పముఁ బెంపుగఁజేయు వేసవిన్ 87

ఉ. కమ్మనిదండలున్ సురఁటిగాడ్పులు వెన్నెలయుం బరాగిపుం
జమ్మును మంచిగంధమును సన్నపువల్వలు సీధుపానముం
దమ్మికొలంకు మేడయును దామరసాక్షు లనంగ నొప్పు భో
గమ్ములు పుణ్యవంతులకుఁ గాని లభింప వటంద్రు వేసవిన్ 88

తే.గీ. కలువ చెలియును బూవుదండలును మంచి
గంధమును గేళిసౌధంబుఁ గలికిమోముఁ,
గాముకునకు వికారంబు గలుగఁజేయుఁ,
గలఁక వాచింప వెపుడు నిష్కామునకును 89

క. కామోద్దీపకయు సముద్దామపయోధరవిరాజితయు జాతిసుమ
స్తోమసుగంధియు నై సర్వామోద మొనర్చెఁ బ్రావృ డంగన భళిరే 90

చ. జలధరమాలికాఖచిత చారునభంబు నవాంకుర ప్రభా
లలితమహీతలంబును గలస్వన కేకికులోల్లసద్వన
స్థలములు జాతినీపకుటజస్ఫుటగంధిలగంధవాహముల్
నెలకొని యెల్ల వారలకు నిండుముదంబు ఘటించె నత్తఱిన్ 91

తే.గీ. మీఁద మబ్బులు మోసులు మిసిమిచూపఁ
బుడమియును గందళమ్ములఁ బొదల, నాడు
నెమ్మిగమితోడ దెసల శైలమ్ము లుండ
విరహిజనుఁ డెందుఁ దనదృష్టి విరయఁజేయు? 92

ఉ. ఇక్కడ గ్రొమ్మెఱుంగుఁదివె, లిక్కడఁ గేతకిగంధవైభవం,
బిక్కడ భూరిగర్జితము, లిక్కడ మత్తమయూరనిస్వనం,
బక్కట యీరసోజ్జ్వలము లైనదినంబులు మన్మథార్తి పెం
పెక్కు వియోగినీజనుల కెట్లు చనం గల వెన్ని చూడఁగన్? 93

చ. ఘనతిమిరంబు సూది కవకాశ మొసంగమి, మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిల, వారికణంబులు రాలుచుండఁగాఁ,

గనకపు రేఖలం దెగడు కాఱుమెఱుంగులు, జారకామినీ
జనములకున్ ముదంబును విషాదమునుం బ్రకటించె ద్రోవలన్ 94

ఉ. కేరుచు మేడనుండి వెలికిం జన శక్యము గాక యుండె నా
సారముచేత, శీతమున జవ్వనికౌఁగిలి గల్గె, శీకరో
దారసమీరణంబు సురతశ్రమవారణ మయ్యె, దుర్దినం
బారయ నయ్యెడన్ సుదిన మయ్యెఁ గృతార్థుల కంగనారతిన్ 95

చ. ప్రియముగ రే సగంబు నిదు రించి, నితాంతరతాంతవిహ్వలుం
డయి దగఁ జెంది, యాసవమ దాలసుఁడై రతిఖిన్న కామినీ
శయమునఁ గర్కరీగళిత చంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయఁ గృతపుణ్యుఁడింపెసఁగఁ ద్రాగు రవాస్థితసౌధసీమలన్ 96

చ. ఘృతదధిదుగ్ధభోజన మొగిన్ భుజియించి, సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి, కుంకుమము హెచ్చుగ మేన నలంది ధన్యుల
ద్భుతరతిఖిన్ను లై విడెము పుక్కిట నుంచి పృథు స్తనాంగనా
కృతపరిరంభు లై కడు రమింతురు మేడలలోన సీతునన్ 97

స్రగ్ధర. ప్రోద్యత్ప్రౌఢప్రియంగుస్ఫుటరుచియుతమై ఫుల్లమల్లీ మతల్లీ
మాద్యత్సారంగమై హైమసపవనచలన్మంజుమందారభూజా
తద్యోతంబైన హేమంతమున విరహసంతప్తులౌ వారి కెల్లన్
సద్యామాయామరాత్రుల్చను విషమయమస్థానసాదృశ్యమూర్తిన్ 98

ఉ. చెక్కులు ముద్దుగొంచు, ముఖ సీమనుసీత్కృతులన్ ఘటించుచుం,
జక్కని చన్గనం బులక జాలములన్ మొలపించుచుం, గటిం
జెక్కినచేలముం దొలఁగజేయుచు, శైశిర మారుతంబు లిం
పెక్కఁగఁ గాంతలందు విట కృత్యముఁ బూని చరించు నిత్తఱిన్ 99

ఉ. వేనలిఁగ్రొన్ననల్ చెదర విప్పుచుఁ గన్నుల మూయఁజేయుచుం,
బూనిన సీత్కృతుల్ నెఱపు మోవుల నొక్కుచు నీవులూడ్చుచున్,

జానుగ మేనులం బులక జాలములన్ వెలయించుచున్, బర
స్త్రీ నికరంబునందుఁ బతి రీతిఁ జరించు సమీరుఁ దత్తఱిన్ 100

# వైరాగ్య శతకము

## మంగళా చరణము - తృష్ణాదూషణము

చ. కలితవతంసితేందుకలికాశిఖిచే విలసిల్లి చిత్తభూ
శలభము నుగ్గుసేసి శుభసార దశాగ్రమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభర గాఢతమోహరణంబు సేయుచుం
దెలివి వెలుంగు పొల్చు శివదేవుఁడు యోగిమనోగృహంబులన్ 1

చ. విసిగితి దుర్గదుర్విషయ విభ్రమయుక్తిఁ గులాభిమానమున్
బసచెడ సేవ చేసితి, విపన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితిఁ, బ్రయత్నము నిష్ఫలమై నశించె, సం
తసపడ వుగ్రకర్మపిశునత్వము చూపెద వాశ, యేటికిన్? 2

చ. నిధి యనుశంక భూతలము నిచ్చలుఁ ద్రవ్వితి, నావచే మహో
దధిఁ దరియించితిన్, శిఖరి ధాతువు లూఁదితి, రాజుఁ గొల్చితిన్,
వ్యథ గొని ఘోరమంత్రజప మర్థి నొనర్చితి గవ్వయైన నే
విధమునఁబొందనైతిఁ గదవే ముదమందఁగదే దురాశరో. 3

చ. పలువలు పల్కుమాట లొక భంగి సహించితి, బాష్పవారి లో
పలనె హరించి శూన్యమగు భావమునన్ వెడనవ్వు నవ్వితిన్,
బొలుపఱి విత్తజాడ్యహతబుద్ధుల కంజలి చేసితిం, గటా!
తలఁకక యింక నేపనికిఁ దార్చెదు నన్ను దురాశ, నీ విటన్ 4

మ. నళినీపత్రగతాంబుచంచలము లెన్నం బ్రాణముల్, వీనికై
గళితప్రజ్ఞత మేము చేయని యసత్కార్యంబు లేదేమియున్,

బలవద్విత్తమదాతిరేక జనితాపస్మారులైనట్టి లు
బ్ధుల మ్రోలన్ నిజసద్గుణస్తుతి మహాదోషంబు గావించుటన్ 5

మ. క్షమచేఁగా దవమాన మోర్చుట, మహా సంతుష్టిచేఁ గాదు గే
హమునం దైవసుఖంబు మానుట, తపోవ్యాసక్తిచే గాదు దు
ర్దమ శీతోష్ణజయంబు కాదు హరుపైధ్యానంబు విత్తంబుబై
నమరెన్ మాకు మునీంద్ర కృత్యములు లేవాసత్ఫలాభ్యున్నతుల్ 6

క. భోగానుభవంబు తపోయోగము కాలంబు చనుటయును ఘనతృష్ణో
ద్యోగవిరామము లే దహహాగురుత వహించి తృష్ణ యలజడి తెచ్చెన్ 7

క. కరచరణాద్యవయవముల భర ముడిగెన్, వళులు మొగముపై నిండారెన్,
శిర సెల్లఁ దెల్లవాఱెను, దరిమాలినతృష్ణ యొకఁటె తరుణత బూనెన్ 8

శా. భోగాపేక్ష తొలంగెఁ, బూజ్యత చెడెన్, బోరాని మిత్రుల్ మహా
భాగుల్ సెల్లిరి, దండ మూఁతగొనుటల్ ప్రాప్తించెఁ, గన్నుల్ తమో
రోగచ్ఛన్నము లయ్యె, దేహము జరారూఢంబు, ప్రాణానిల
త్యాగాపాయభయంబునన్ వడఁకెడున్ దానెంత సమ్మూఢమో! 9

చ. కలితమనోరథంబు లుదకంబులు, తృష్ణలు భూరివీచికా
వళు, లనురాగముల్ మకరవర్గము, మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ, ధైర్యఫలభూజము గూల్చు దురాశ పేరి పు
ష్కలనది దాఁటి నిత్యసుఖ సంపదఁ గాంతురు యోగిపుంగవుల్ 10

## విషయపరిత్యాగ విడంబనము

చ. భవమునఁ బుట్టుసత్క్రియ శుభం బని చూడము, పుణ్యకర్మగా
రవఫలమైన సంపద కరంబు భయావహ మెన్ని చూచినం,
బ్రవిమలపూర్వపుణ్యసముపార్జిత చందనముఖ్యభోగ వై
భవమును భోగశీలుర కపాయము చేయను వృద్ధిఁబొందెడున్ 11

చ. ఉరుగతితోడ నేఁగుఁ దడ వుండియు భోగము, లట్టివానిఁదా
నరుఁడు పరిత్యజింపడు, కనంగనఁ దద్విరహంబు భిన్నమే?
పురుషుని భోగముల్ విడిచి భూరిమనోవ్యథ లాచరించు, నా
పురుషుఁడె భోగముల్ విడిచి పొందు నిరామయశాంతి సౌఖ్యముల్ 12

చ. అనఘులు బోధపూర్ణులు మహాత్ములు భోగనిధానమౌ మహా
ధనము, బరిత్యజింతురు గతస్పృహులై పరమాద్భుతంబుగా;
మునుపును బొంద, కిప్పుడును ముట్టక యింకనుఁ జెందలేక, నె
మ్మనమునఁదోఁచు భోగముల మానఁగఁజాలము మే మొకింతయున్13

చ. గిరిగుహలన్ వసించి వృష కేతనచింతన మాచరించు స
త్పురుషులసమ్మదాశ్రుకణ పుంజముఁ గ్రోలుచు నంకశయ్యలం
దిరవుగ నుండుఁ బక్షులు, సమిద్ధమనః కృతసౌధవాపికా
వరవన కేళిశీలురగు వారల కాయువె విక్షతం బగున్ 14

చ. నిరతముఁ దిండి బిచ్చమగు, నీరస, మద్దియు నొక్క పూఁటయే,
ధరణితలంబు సెజ్జ, సతతంబును దోడు శరీరమాత్రమే,
చిరుఁగుల చీర తున్కగమి చేత నమర్చినబొంత పుట్ట, మీ
కరణి మెలింగినన్ విషయ కాంక్ష లొకింతయుఁ బాయ వక్కటా! 15

చ. స్తనములు మాంసపిండములు చక్కని బంగరుకుండ లంచు, నా
ననము కఫాలయంబు తుహినద్యుతితుల్య మటంచు, మూత్రభా
జనజఘనస్థలంబు కరిఁ చారుశిరస్సమ మంచుఁ, గామినీ
జనమలినాంగముల్ సుకవి చాతురి వర్ణన కెక్కె నిమ్మహిన్. 16

ఉ. కాముకులందు మే సగము గాంతకు నిచ్చెను శంకరుండె, ని
ష్కాములలోనఁ బంచశర శాసనుకన్న ఁబరుండుఁ గల్గఁ, డు
ద్దామమనోజబాణవిషదగ్ధులు తక్కినమూఢు లోప రే
సీమల భామినీసుఖముఁ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్ 17

చ. తెలియక నాశహేతువగు తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁగాక, మతి చాలక మీనము గాలపుంగొనం
గల పిశితంబు తా మెసఁగుఁ గాక, యెఱింగియు మేము దుఃఖదో
హలవనితాసుఖంబు విడనాడము, మోహమహత్త్వ మెట్టిదో! 18

ఉ. శీతలవారిఁద్రావు వడఁ జెందినవాఁడు క్షుధార్తుఁడిష్టమృ
ష్టాతతభక్ష్యమాంసకలి తాన్నము సాపడు, మన్మథాగ్ని తా
పాతురుఁడైనవాఁడు జవరాలిఁగవుంగిటిలోనఁజేర్చు, నీ
రీతిని రోగశాంతికరకృత్యము భోగ మనంగఁ జెల్లునే? 19

చ. పొదువులు మాడువుల్ ఘనులు పుత్రులు పెక్కురు రమ్య సంపదల్,
పడతుక చారుశీల, యెలప్రాయ మటంచు నరుండు మూఢుఁడై
కడు జగమెల్ల శాశ్వతము గాఁగొని సంసృతి బంది లోపలం
బడు; నిది మాయయంచు మతి మంతుఁడు దావిడుచు న్సమస్తమున్ 20

## యాంచాదైన్యదూషణము

ఉ. ఆఁకొని యేడ్చు లేఁజిఱుతలన్నముకై తనకొంగు లాగఁ బె
ల్లాఁకట సోలుచుండెడు నిజాంగన దుర్దశఁ జూడఁడేని యా
చ్ఞాకలనా విభంగభయ సంభృత గద్గదశూన్యకంఠుఁడై
చేకొని దేహి యం చడుగఁ జేరునె కాలినపొట్ట కెవ్వఁడున్! 21

శా. మానగ్రంథివిభేదనక్షమము, శుంభద్ధైర్యగాంభీర్య ము
ఖ్యానేక ప్రియసద్గుణాంబుజసమూహజ్యోత్స్న, లజ్జాలతా
హానిస్ఫారకుఠారధార జఠరం బన్నట్టి పెన్బాన, యౌ
రా నిండారదు దైన్యవృత్త్యభినయ ప్రాగల్భ్యముం జూపుచున్ 22

చ. అవనిసురావళీహుతహుతాశనకోమలధూమధూమలా
ప్రవిశదవాటియందు వనభాగమునందుఁ గపాలపాణియై
భవనములందు భిక్షగొని ప్రాణము దాల్చుట కొంతమేలు బాం
ధవులను జేరి వేఁడు కడు దైన్యముఁ జెందుటకంటె మానికిన్ 23

తే. పూతగంగోర్మిశీకర శీతలములు
లలితవిద్యాధరాధ్యశిలాతలములు,
హిమగిరిస్థానములు నశియించె నొక్కొ
నరులు నిందితపరపిండ నిరతు లగుట 24

మ. ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో యేళ్లింకెనో కొండలన్?
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం బాడయ్యెనో? చూడఁ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవనవ్యానర్తితభ్రూలస
త్ఖలభూపాస్యములర్థిఁ జూచెదరు భ్రాంతస్వాంతులై యాచకుల్ 25

చ. ప్రవిమలకందమూలఫలపంక్తుల జీవికఁ జేయు మ్ముర్విపై
నవనవపల్లవంబుల నొనర్పుము పానుపు, లెమ్ము, పావనా
టవికిని బోవు, మయ్యెడ దృఢద్రవిణామయదుర్వికార గౌ
రవవికలోక్తులై మెలఁ గు రాజుల పేరును జెప్పఁ డెవ్వఁడున్ 26

చ. కలవు పచేళిమంబు లయి కానలలోపలఁ బండ్లు మ్రాఁకులం
గలవు పవిత్రవాహినులఁ గమ్మనిశీతలవారిపూరముల్,
గలవు చివుళ్ళపాన్పు లవి గైకొన నేరక దీనులైన ధనా
ఢ్యులగవనిన్ వసించి నరు లోలి సహింతురు తీవ్రతాపమున్ 27

చ. ధనపతిమ్రోల నిల్చి కడు దైన్యముఁ జూపెడువార లెవ్వరో
ఘనవిషయాభిలాష మతి కల్పన మీఱిన నీచు లెవ్వరో
మొనయుచు వారి దుష్టదినముల్ మది నవ్వి తలంతు నాత్మచిం
తనము తుదిన్ గుహాంతరమునన్ రుచిరోపలతల్పశాయినై 28

మ. వరసంతోష నిరంతర ప్రముదితుల్, వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్, కనకలుబ్ధస్వాంతులౌ వారికిన్
విరతిం బొందరు తృష్ణ, యెవ్వనికిఁ గావింపంబడెన్ బ్రహ్మచే
స్థిరసంపన్నిధి మేరు వాత్మ ధృతలక్ష్మీకంబు నాకిష్టమే? 29

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భిక్షాహారమున్ వీత దై
న్యభయక్రోధమదాభిమానజడిమాహంకారమున్ సత్సుఖ
ప్రభవం బశ్రమలభ్య మూర్జిత మవార్యం బక్షయం బుగ్ర దుః
ఖభిదాదక్షము శంభుసత్రము మహాకైవల్య సత్పాత్రమున్ 30

## భోగాస్థైర్య వర్ణనము

చ. బలగుణరూపభోగకుల భర్మకళేబర శాస్త్రమానముల్
బలిఖలరుగ్జరాచ్యుతి నృపాలయమప్రతివాదిదైన్యసం
కులభయయుక్తముల్ నరులకున్ భువి నెవ్వియు నిర్భయంబులై
నెలకొన వెన్ని భంగులను నిర్భయ మొక్క విరాగమే సుమీ 31

చ. జననము చావుచేత, శమసౌఖ్యము కాంతల లీలచేత, జ
వ్వనము జరార్తిచేత, గుణవర్గము కూళలచేత, రాజు దు
ర్జనములచే, ముదంబు ధనరాగముచే, సిరు లెల్ల లేమిచే,
వినిహతిఁజెందు, దోషపరివిద్ధము గాదె తలంప నెద్దియున్? 32

శా. ఆధివ్యాధిశతంబుచే జనుల ధైర్యం బెల్ల నిశ్శోభమై
బాధింపంబడు, సంపదల్ గలుగుచోఁ బ్రత్యక్షమై ద్వారసం
రోధం బేమియు లేక దుర్దశలు చేరున్, మృత్యువున్ మర్త్యుల
న్వేధించు, న్విధి యేది సుస్థిరముగా నిర్మించెఁ దర్కించినన్ 33

ఉ. తుంగతరంగభంగములతోఁదులదూఁగువిలోల భోగముల్,
భంగపడున్ నిమేషమునఁ బ్రాణము కొన్ని దినంబులే సుఖం
బంగనలందు నట్లు మది నారసి బ్రహ్మవిచార యత్నము
ప్పొంగుచుఁ జేయఁగావలయు భూరిజగద్ధితబుద్ధిఁబండితుల్ 34

చ. జలదములోనిక్రొమ్మెఱుఁగుఁ జాయలు భోగపరంపరల్, మహా
నిలపరిఘట్టితాబ్జదళ నీరతుషారము జీవితంబు, చం

చలతరముల్ వయోభిమతసౌఖ్యము, లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మయోగమున బుద్ధి ఘటింపుఁడు సత్వరంబుగన్ 35

ఉ. ఆయువు వీచిచంచలము యౌవన మల్పదినోచితంబు, పు
ష్పాయుధకేళిజన్యసుఖ మస్థిర, మర్థము వాంఛవోలె సా
పాయము, భోగముల్ మెఱపు లట్లభ్రమించు, భవాబ్ధిలంఘనో
పాయము బ్రహ్మచింతనముఁ బాయక సేయుఁడు సజ్జనోత్తముల్ 36

ఉ. కాయము గుంచి గర్భనరకంబున నుండుట దుఃఖ మాదియం,
దాయతలోచనా విరహ మబ్బుట దుఃఖము జవ్వనంబునం,
బాయక భామినీహసనపాత్రము దుఃఖము వృద్ధభావ, మిం
కే యెడఁగల్గు సౌఖ్యలవమించుకయే జనులార చెప్పుఁడీ 37

చ. కడు వెఱపించుచున్ ముదిమి గద్దఱి బెబ్బులిమాడ్కి నున్న, దె
క్కుడుపగదాయలంబలెఁదెగుళ్ళు శరీరము నొంచుచున్న, వె
ప్పుడుఁజను భిన్నకుంభజలముంబలె నాయువు, లిట్టులయ్యుదా
రుడుగక మానవుల్ దురిత మోలి నొనర్చుచునున్న వా రహో! 38

చ. తరళతరంబులున్ బహువిధంబులు భోగము, లీదురంత సం
సరణము వానిచేఁ బొడమెఁ, జాలు c బరిభ్రమణంబు వానికై,
నరులు మదీయభాషణము నమ్మెద రేని శమప్రసన్నమై
పరఁగు మనంబు శంభుపదపద్మయుగ ప్రవణంబు సేయుఁడీ 39

ఉ. ఎందు వసించి ధన్యుఁడు విధీంద్రముఖామరకోటి నెల్ల నెం
చుం దృణమట్ల, దేనిఁ జవిచూచుటచే రసహీన భావముం
జెందు జగత్ప్రభుత్వమును జెప్పఁగరాని యనంత కేవలా
నందము, దానియందు మది నాటుము మానుము నీచభోగముల్ 40

## కాలమహిమాను వర్ణనము

మ. అది మేలైన పురంబు, పూజ్యచరితుం డారాజు, రాణ్మండలం
బది, పార్శ్వంబున నావిదగ్ధసభ, వారబ్జాస్య లత్యుద్ధతం

బది రాజన్యక, మద్ది వందినికరంబాగాథలున్, సర్వముం
గదలం జేసిన కాలమూర్తికి నమస్కారంబు సత్కీర్తికిన్ 41

శా. ఏయింటన్ వసియించుఁబెక్కు లొకఁ డా యింటం బ్రవర్తించు, నే
చాయన్ నిల్చు నొకండు పెక్కు లచటన్ సంధిల్లు , నొండైన లే
దాయింటన్, మది నిట్లు రాత్రిదినరూపాక్షద్వయిం జిమ్ముచుం
జేయుం గాలుఁడు క్రీడ లోకఫలక శ్రేణిన్ నృశారంబులన్ 42

చ. అనుదినమున్ నశించుఁబర మాయువు సూర్యుని రాకపోకలన్,
ఘనబహుకార్యభారములఁ గాలము పోవుట గానరాదు, సం
జననజరామయంబులును జావును జూచి భయంబు లేదు, దు
ర్జనభువనంబు మోహమదిరారసవిహ్వల మయ్యె నయ్యయో! 43

ఉ. వచ్చినరాత్రులే తిరిగి వచ్చుట వోయిన వాసరంబులే
వచ్చు టెఱింగి గూఢతర వర్తనులై పునరుక్త కార్యముల్
నిచ్చలు సేయుచున్ జనులు నిశ్చలవృత్తిఁజరింతు రీభవా
భ్యుచ్చయరీతిచేఁజెడి కుబుద్ధులు సిగ్గు వహింప రెంతయున్ 44

ఉ. శ్రీరమణీయశంభుపద చింత యొనర్చుట లేదు, గోపుర
ద్వారకవాటపాటన సుధర్మము సేయుట లేదు, సుందరీ
హారికుచోరులబ్ధిఁ గల నైన నెఱుంగము, మాతృయౌవనో
దారవనీ కుఠారముల మై జనియించిన వార మిమ్మహిన్ 45

చ. వలనుగ విద్యనేర్చి ప్రతివాదుల గెల్చుట లేదు, కుంభి ని
ర్దళన నిశాత ఖడ్గముల దైవతలోకమునందుఁగీర్తులన్
నిలుపుట లేదు చారురమణీ మధురోష్ఠముఁ గ్రోలలేదు ని
ష్ఫల మయి జవ్వనం బరిగెఁ బాడుగృహంబున దీపముంబలెన్. 46

చ. వినయ విశేష హృద్యలగు విద్యలు నేర్చుట లేదు, నీతిచే
ధనమును గూర్పలేదు, తలిదండ్రుల సేవయుఁ జేయలేదు, చ

క్కని చిగురాకుఁబోండ్ల బిగి కౌఁగిలియుం గలనైనలేదు, గొ
బ్బున సమయంబు కాకులకుఁ బోలె గతించెఁబరాన్న భుక్తులన్ 47

ఉ. తాలిమి మాలి కన్నతలిదండ్రులఁ దోడ మెలంగువారలం
గాలము గోలుపుచ్చె నని కానరు, ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్య సన్నిహిత దుర్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజములకున్ సరివత్తురు మూఢమానవుల్ 48

ఉ. ఆయువు నూఱువత్సరము, లందు సగంబు నశించె నిద్రచే,
నాయఱలో సగంబు గత మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ,
బాయక తక్కినట్టి సగఁబాలు గతించు ఁబ్రయాసవృత్తిచే,
నాయువు చంచలం, బగుడుఁ బ్రాణుల కెట్లు సుఖంబు చేకుఱున్ 49

ఉ. బాలకుఁడై క్షణంబు, యువ భావయుతుం డయి కొంత కాల, ము
ద్వేలదరిద్రుఁడై క్షణము, విత్తసమన్వితుఁడై క్షణంబు, జీ
ర్ణాలసగాత్రుఁడై నటుని యట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయనామ మైన తెర యందు ఁజొరంబడు సత్వరంబుగన్. 50

## యతినృపతి సంవాదము

ఉ. రాజవు నీవు, మేము గురురాట్కలిత ప్రతిభాభిమాన వి
భ్రాజిత మహోన్నతాత్ములము; భవ్యధనప్రథితుండ వీవు, స
ద్రాజి నుతించు మాయశము దవ్వు సుమీ మనవాసి; మమ్ము ని
ర్వ్యాజతఁ జూడవేని యనురాగము మాకును లేదు నీయెడన్ 51

చ. ధనపతి వీవు, మేము వివిధశ్రుతిపుంజపదార్థతత్త్వ శా
సనులము; నీవు శూరుఁడవు, చండతర ప్రతివాదిగర్వభం
జనులము మేము; నిన్ను ధనశాలురు, మమ్ముభజింతురాశ్రితుల్;
వినయము సేయవేని పృథివీవర సాగెద మీక్షణంబునన్ 52

చ. కలితదుకూలవస్త్రములు గట్టిననీకును జీర్ణవల్కలం
బులు ధరియించుమాకును బ్రమోదము తుల్యము, లేదువాసి; య

గ్గల మగుతృష్ణ యెవ్వనికి గాఢదరిద్రుఁడు వాఁడు; లేమియుం
గలిమియు లేవు సమ్మద వికస్వరమానసులైన వారికిన్. 53

చ. ఫలములు చాలు జీవికకుఁ, బానము సేయ జలంబు చాలు, వ
ల్కలములు చాలుఁగట్టుట, కిలాతలముల్ శయనింపఁజాలు, ని
ష్ఫలనవవిత్తసీధురస పానవిజృంభిత మోహలీన చి
త్తు లగు నికృష్టభూపతుల దుర్ణయ మించుకయున్ సహింతునే? 54

తే. చేరి భిక్షాన్న మారగించెదము మేము,
కట్టెదము దిక్కు లనియెడి కలితశాటిఁ
బవ్వళించెద మిల యను పాన్పుమీఁద,
నేమి కార్యము మాకు నరేంద్రులందు? 55

క. విటగాయక వైతండిక
నటజనులము గాము, పృథుఘనస్తననమితో
త్కట వారకాంతలము గా,
మటు గావున నృపునిఁ జూడ నగునే మాకున్? 56

ఉ. అంచిత బుద్ధులైన మనుజాధిపతుల్ జగ మెల్లఁదొల్లి ని
ర్మించిరి, దానిఁగొందఱు భరించిరి, యిచ్చిరి గొంద ఱర్థికి,
న్మించి జగమ్ము లన్నియును నెమ్మిభుజించుచుఁ గొందఱుండఁగాఁ
పంచషపట్టణేశుల కపార మదజ్వర మింత యేటికిన్. 57

చ. ఎడ నిముసంబు లేక ధరణీశ శతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ పొందునె రాజుల, నేలతున్కలో
నడరు లవంబులోఁ దునియ యం దొకమూలకు నాథులైన వా
రడలక వైపరీత్యమున హర్షముఁజెందుదు రెంత మందులో! 58

చ. తగ జలరేఖచే వలయితం బగు కొంచెపు మంటిముద్దకై
జగడము లాడి యాడి పెలుచన్ విభజించి భుజించుచున్న దు

ర్థగన్నపు లిచ్చువారె? తలఁ పం గడు నీచులు; వారియందు నొ
ప్పుగ ధనలేశకాంక్ష గల పూరుషులుం గడుహీనులే గదా! 59

చ. అతఁడు సుజన్ముఁ డెవ్వని సమంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దల పై ధరియించె విభూషణంబుగా,
క్షితిపయిఁ బ్రాణరక్షణము సేయుటకై తముఁ జేరి కొంద ఱా
నతు లయి రంచు దుర్మదఘనజ్వర మేటికి మానవాళికిన్ 60

## మనస్సంబోధన నియమనము

చ. పరులమనంబు లోలి బహు భంగులఁ గొల్చి ప్రసన్నతా గుణ
స్ఫురణ వహింపఁ జేయుటకుఁ బూనఁగ నేటికి నీవు చిత్తమా?
స్థిరముగ సుప్రసాదము భజించి నిలింపమణీగణోదయ
స్ఫురితగతిన్ మనోరథము సొంపు వహింపదె నీకు మేలుగన్. 61

ఉ. ఏల పరిభ్రమించెద వనేక విధంబుల వెఱ్ఱిచిత్తమా?
తాలిమి విశ్రమింపు మొక తావున; యత్నము లేకయే యగున్
మేలును గీడు; నేఁదలఁప మించిన కార్యము భావికార్యమున్,
లాలసవృత్తిఁగోర; విధి లబ్ధఫలంబులు నే భుజించెదన్. 62

శా. ఆయాసప్రద మింద్రియార్థగహనం బౌ త్రోవ వర్జింపుమీ,
శ్రేయోమార్గము సర్వ దుఃఖ నికరచ్ఛేదార్థమై చేరుమీ,
ధ్యేయాద్వైతముఁ బొందుమీ, స్థిరతచే దీపింపుమీ, చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ, మాలిన్యమున్ వీడుమీ 63

చ. దురితపుమోహముందొలఁగఁ ద్రోయుము, సేయుము భక్తిశూలిపై,
వరసురవాహినీతటనివాసముఁజేకొను! మేటినమ్మికల్
తరఁగలయందు బుద్బుదవితానములందు మెఱుంగుఁ దీఁగెలం
దరయఁగఁగీలలందు ఫణులందు సుహృజ్జనులందు డెందమా? 64

మ. అవనీశభ్రుకుటీకుటీ విహరణవ్యాపారపణ్యాంగనన్
భువిలో సంపద నించుకం గొనకుమీ భోగార్థమై చిత్తమా;

శివమోదావహ కాశికానగర సుశ్రీరాజమార్గంబులన్
భవనద్వారములందుఁ జేత నిడు సద్భైక్షం బపేక్షించెదన్ 65

చ. సరసులు దాక్షిణాత్యకవి చంద్రులు చెంతలయందు, ముందటన్
సురుచిరగీతమున్, వెనుక శోభితచామర పాణి మానినీ
కరమణికంకణక్వణముఁ గల్గిన యేని భవానుభూతిచేఁ
బరఁగుము, గల్గవేని భవభంజనయోగముఁ బూను మానసా. 66

చ. సకలశుభంబు లిచ్చు ప్రియసంపద వచ్చిన, నేమి దానిచేఁ?
బ్రకటవిరోధిమస్తకము పైఁబద ముంచిన, నేమి దానిచే?
నికటధనంబుచే హితుల నేర్పుగ నేలిన, నేమి దానిచే?
వికృతముగాక ప్రాణికి భువిం దను వుండిన, నేమి దానిచేన్? 67

చ. హరచరణాబ్జయుగ్మమున నంచితభక్తి, మనంబులో జరా
మరణభయంబు, బాంధవసమాజముపై స్పృహలేమి, దుస్సహ
స్మరశరనిగ్రహంబు, మునిమాన్యవివిక్త వనప్రదేశముల్
పరమవిరక్తియుం గలుగ, భాగ్యమహోన్నతి వేఱ యున్నదే? 68

తే. కావున ననంత మజర మక్షర మజంబు
బ్రహ్మము భజింపు, మతివికల్పములు మాను,
బ్రహ్మసంగికి భువనాధిపత్యభోగ
పదవియును నీకుఁ దుచ్ఛమై పరఁగుఁ జువ్వె. 69

చ. బలిసదనంబుఁజొచ్చెదవు ప్రాఁకెద వభ్రపదంబు దాఁటి, ది
గ్వలయము నాక్రమించెదవు వారక చిత్తమ చాపలంబునం;
దలఁప నొకప్పుడున్ మఱచి తప్పియు లోన వెలుంగు బ్రహ్మము,
న్దలఁచెదవేని పొందెదవు నాశవివర్జిత నిత్యసౌఖ్యమున్ 70

## నిత్యానిత్యవస్తువిచారము

ఉ. శ్రీమహిత శ్రుతిస్మృతులచే బహుశాస్త్రపురాణయుక్తిచే
నేమి ఫలంబు లౌక్యజనవృత్తికి నీ ఁదగు నిర్జరాలయ

గ్రామకుటీనివాసఫలకర్మముచే ఫలమేమి? జన్మదుః
ఖామయభేషజాక్షయమహాసుఖ మొక్కటి దక్క నన్నిటన్. 71

చ. స్థిరతరమైన మేరువు నశించు యుగాంతకృశానుకీలలన్,
వరమకరాలయంబు లగు వారినిధానములెల్ల నింకు, భూ
ధరములచే ధరింపఁబడు ధారుణి పోఁడిమి దప్పుఁ, గావునం
గరికలభశ్రవశ్చపల కాయమునం దిఁక వార్త లేటికిన్? 72

చ. తనువు ముడుంగుఁ, బాదగతి దప్పును, దంతము లూడుఁ, జీఁకటుల్
కనుఁగవ వర్తిలుం, జెవుడు గ్రమ్మును, జొంగలు గాఱు మోమునన్,
జనములు మాట చేకొనరు, సన్నిధిఁ జేరదు భార్య, పుత్త్రుఁడుం
గొనకొని శత్రువట్ల తిరుగుం; గడుఁగష్టము వృద్ధ దేహికిన్ 73

ఆ. కురుల తెలుపు చూచి కొఱగాఁడు వీఁడని
ముసలివాని విడిచి ముదిత లెల్ల
దూరముగఁదొలంగుదురు సాస్థికలమౌ
మాలనూతి విడిచి మలఁగుభంగి 74

చ. ధృతిఁగొని రోగముల్ జరయు దేహము నొంపకముందె, ఇంద్రియ
ప్రతిహతి లేక ముందె, తన ప్రాణవిరామము కాకముందె, పం
డితజనఁడాచరింపఁదగు రీవిఁబ్రయత్నము ముక్తికిన్, మహో
ద్ధతశిఖి నిల్లు గాలుతఱిఁ దాలిమి నూతులు ద్రవ్వ టొప్పునే? 75

మ. తపముల్ సేయుచు దేవతాతటినిచెంతన్ నిల్తుమో, కాక దా
రపరత్వంబున నుందుమో, వివిధశాస్త్ర శ్రవ్యకావ్యామృతం
బుపభోగింతుమొ, యేమి సేయను హితం బూహింపఁగా లే, మని
త్యపులోకంబున మానవుల్ మితనిమేషాయుష్కులై యుండఁగన్. 76

ఉ. వాజిచలస్వభావు లగు వారు ప్రసన్నులు గారు భూపతుల్,
రాజసవృత్తి మానరు, దురాశయు నెక్కుడు మాకు సొమ్ముపైఁ

దేజ మదంచు వృద్ధదశ, దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁ, డ
వ్యాజ తపంబుకన్న భువి నాత్మహితంబగు కృత్య మున్నదే? 77

ఉ. మానము గ్రుంగఁగా, ధనము మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁజెంది యేఁగ, నతిథి ప్రకరంబు నిరాశమైఁజనన్
మానుగ జవ్వనం బరుగ మాన్యునకుం దగు జహ్నుకన్యకా
నూన తరంగపూత కలితోపల శైలనికుంజవాసముల్. 78

ఉ. మంచివి పండువెన్నెలలు మంచివి పుష్పవనప్రదేశముల్,
మంచిది సాధుసంగమసమాగతసౌఖ్యము, చాటువాక్యముల్
మంచివి, మంచి దశ్రుయుత మానవతీముఖ; మీ సమస్తమున్
మంచిది కా దనిత్య మని మానసవృత్తి నెఱుంగువారికిన్. 79

ఉ. సంతతమున్ సుఖం బొసఁగఁ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగమున్ మధుర గానములున్ వివరించి చూడ? సం
భ్రాంతపతంగ పక్షభవ మారుత ఘాతవిధూత దీపికా
కాంతిచలంబు సర్వ మని కానల కేఁగిరి పండితోత్తముల్ 80

## శివార్చనము

మ. తగ సంసారము నాదినుండియును ద త్తత్కర్మసంయుక్తి ము
జ్జగముం ద్రిమ్మరు మాకుఁగానఁబడ ఁడే చందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరిణీ గాఢాదరోన్మత్తచి
త్త గరిష్ఠద్విపరాజసంయమపటు స్తంభాత్మకుం డెవ్వఁడున్ 81

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియించుట, దైన్యము లేని తిండియున్,
నిచ్చలు సాధుసంగమును నిర్మలశాంతియు శాస్త్రబోధమున్,
మచ్చిక లోనఁ బూని వెలిమట్టనిచిత్తము, నాఁగ నింతయున్,
వచ్చుట యే మహోన్నత తపంబుఫలంబొ యెఱుంగ నేర్తుమే? 82

ఉ. చిత్తమునందె కోరికలు జీర్ణములయ్యె, నశేషగాత్రమున్
హత్తినజవ్వనం బరిగె, నార్యులు లేమి గుణంబులున్ ఫలో

చ్ఛిత్తి వహించె, నెద్ది తగు? జేరక మానదు కాలుఁడక్కటా!
చిత్తజవైరిపాదయుగ సేవనమే గతిగా నెఱింగితిన్ 83

తే.గీ. జగదధీశ్వరుఁడగుమహేశ్వరునియందు
సకలజగదంతరాత్ముఁడౌ శార్ఙ్గి యందు
భేదవిజ్ఞాన మెయ్యెడ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరు నంద భక్తి 84

శా. శాంతారావనిశీథ కాలముల భాస్వత్సాంద్రచంద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయోగ్యక్షోణిఁగూర్చుండి జ
న్మాంతో ద్వేగుల మైన మేము శివశబ్దావృత్తితో నెప్పుడ
త్యంతానందభవాశ్రుసంకులదశావాప్తిన్ సుఖం బుందుమో? 85

చ. కలధన మంతయున్ సెలవు గా నిడి నూత్న కృపాప్రపూర్ణ చి
త్తుల మయి, సంసృతిం గుశల దూరవిపాకము నాఁగ దైవముం
దలఁచుచుఁ, గానలో శివపద స్మృతినిష్ఠులమై నయింపఁగాఁ
గలము శరత్ప్రసన్న మిహికాకర రమ్యములైన రాత్రులన్ 86

ఉ. శ్రీనుత కాశియం దమర సింధువు చెంగట నిల్చి, గోఁచినిం
బూని, ప్రణామముద్రఁదల మోపి, "పురాంతక! పార్వతీశ! శం
భో! నిటలాక్ష! రక్ష" యని మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలాను సం
ధానత నెన్నఁడే ఁగడపెదన్ దినముల్ నిమిషంబు కైవడిన్? 87

ఉ. వేలుపుటేటఁ దోఁగి, సుపవిత్రఫలాదులఁ బూజచేసి, ని
న్నోలి మనంబులో నిలిపి, యోగ్యగుహాశిలయందు నాత్మసం
శీలుఁడ నై, ఫలాశి నయి, శ్రీ గురువాక్యరతుండనై, మహీ
పాలక సేవనశ్రమముఁ బాసెద నెన్నఁడు మన్మథాంతకా? 88

తే. ఒంటి దిరుగుచుఁ గోరిక లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణిభాజనుఁడనై ది

గంబరుండనై నమస్తకర్మంబు లెపుడు
మొదలు చెడఁద్రుంతుఁబరమేశ! సదయహృదయ 89

చ. హితునకుఁబాణిపాత్రున కనిచ్చునకున్ శుచిభైక్షమాత్రతో
షితునకు నెట్టితావున వసిం చెడువానికి విశ్వముం దృణ
ప్రతినిధిఁ జేయువానికిఁ బురస్థితుఁ డయ్యె నఖండసౌఖ్యసం
గతుఁడగుయోగి కేర్పడు నొకానొక మార్గము శంభుసత్కృపన్ 90

## అవధూత చర్య

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపేక్షాశూన్య భైక్షంబుఁ జిం
తాపాయంబు వనశ్మశానముల నిద్రావాప్తి దుర్వారస
ద్వ్యాపారంబుఁబ్రశాంత చిత్తమును యోగారూఢియున్ వృత్తిసం
క్షేపంబుం గలదేని యోగికిఁ ద్రిలోకప్రాభవం బేటికిన్? 91

క. మండలమాత్రం బగు బ్రహ్మాండము లోభకర మగునె యతిధీరునకున్?
నిండుసముద్రము జలచర తాండవగతిచే విలోడితమ్ము గాదుగదా? 92

క. అమ్మా! లక్ష్మి నమస్కారమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యారూపమ్మున నేలుకొను ముఖ్య ఫల మదియకదా! 93

చ. ధరణి విశాలతల్ప ముపధానము బాహువు, నింగి చందువా,
సురఁటులు గంధవాహములు, శోభనదీపము చందురుండు గా,
విరతి వధూమణిం గలసి? వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగి శయనించు మహీపతి మౌళికైవడిన్ 94

శా. హీనాదానవిరక్తమార్గనిరతుం డక్షయ్యభిక్షాశి స్వా
ధీనారంభుఁ డు లోకసంగదురితాతీత స్వభావుండు ర
థ్యానిక్షి ప్తవిశీర్ణవస్త్రకృతకంథాసీనుఁ డాత్మాక్షర
ధ్యానాసక్తుఁ డొకానొకండు విగతాహంకారుఁడొప్పున్ భువిన్ 95

ఉ. మాలఁడొ వీఁడు విప్రకుల మండనుఁడో మఱి శూద్రుఁడో తప
శ్శీలుఁడో సిద్ధుఁడో యనుచుఁ జెంతలఁ జేరి వికల్పజల్పవా

చాలజనంబు లాడఁగ వెసం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురు గారు మిన్నక భువిన్ విహరింతురు యోగిపుంగవుల్ 96

చ. చిలువల గాలిమేపరులఁ జేసి, తృణాంకుర భోజనంబు భూ
తలశయనంబు గోవులకుఁ దామరచూలి విధించెఁ; దత్త్వపే
శలమతు లైనవారలకు సన్నుతవృత్తి ఘటించె ; దానిచేఁ
దొలఁగు రజస్తమోజనిత దోషము లెల్ల భుజించువారికిన్ 97

ఉ. శ్రీ సురసింధుతీరమున శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసనవర్తినై శివు నుపాస్తి యొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్ననాతనువు పైఁ దమ మేనులతీఁట దీఱ న
త్రాసములై కురంగములు రాపులు సేయుట గల్గునే కదా 98

ఉ. పాత్రము పాణిపంకజము, భైక్షము భోజ్య, మనల్పతల్ప మీ
ధాత్రి, దిశాష్టకంబు పరిధాన మగున్ భువినేరికా సుచా
రిత్రు లసంగతాగుణధురీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశములఁ బాసి దహింతురు కర్మబీజమున్ 99

మ. జననీ మేదిని! తాత మారుత! వయస్యా వహ్ని! చుట్టంబ జీ
వనమా! సోదర తారకాపథమ! భవ్య ప్రేమ సంధిల్ల మీ
కొనరింతుం జరమప్రణామము, భవద్యోగస్ఫురత్పుణ్య సం
జనితజ్ఞాననిరస్తమోహతతి నై సద్బ్రహ్మముం బొందెదన్ 100



| | | |
|---|---|---|
| పేరు | : | **ఆముదాల మురళి** |
| తల్లిదండ్రులు | : | శ్రీమతి ఆముదాల సాలమ్మ, శ్రీఆముదాల కృష్ణయ్య |
| పుట్టిన తేది | : | 13-08-1975 |
| జన్మస్థలం | : | అత్తిమాకుల పల్లి, తవణం పల్లి మండలం<br>చిత్తూరు జిల్లా-517 129 |
| వృత్తి | : | సంస్కృత ఉపన్యాసకులు<br>విజయకృష్ణ జూనియర్ కాలేజ్, తిరుపతి |
| నివాసం | : | 9-65, యస్.బి.ఐ. కాలని<br>రేణిగుంట రోడ్డు, తిరుపతి-517 507<br>ఫోను : 9440432683 |
| బిరుదులు | : | అవధాన ప్రసూన, అవధాన కళానిధి |
| ముద్రిత రచనలు | : | పచ్చని తెలుగు-2007<br>స్వర్ణతుషారం-2011 |
| పురస్కారం | : | మహర్షి కృష్ణానంద తిరుపతి కళాపురస్కారం-2011 |
| అముద్రితాలు | : | శ్రీకాణిపాక వినాయకమ్ (పద్యకావ్యం)<br>పురాణంలో పుష్యరాగాలు (పద్యఖండికలు)<br>అవధానం - అంతర్మథనం.<br>తులసీదాస ప్రబంధం.<br>వజ్రకిరీటం (పద్యఖండికలు) |

సీ॥ వీధియరుగు మీద విజ్ఞులెల్లరుఁజేరి
వాదంబుఁజేసెడి వరుస లేదు
వంశపారంపర్య పాండిత్య సంపదల్
ముల్లెగా వచ్చిన మురువు లేదు
మంత్రశాస్త్రంబుల మహనీయబోధల
కాలయాపనలైన క్షణము లేదు
క్రమముగా చదివిన కావ్యపాఠంబులు
పాథేయమైనట్టి పట్టులేదు

తే.గీ. నీదుపాదంబు దలచిన నిముషమందు
గట్టి కైతలు నాలోన పుట్టి వచ్చి
కావ్యగంగగ నీకాళ్ళు కడుగునట్లు
వాణి! నీ ప్రేమ నాపైన పరచు తల్లి!

( వజ్రకిరీటం నుండి )